# విశ్వంభర

(భారతీయ జ్ఞానపీఠ పురస్కారం పొందిన కావ్యం)

డా॥ సి. నారాయణరెడ్డి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.

VISWAMBHARA (Epic Poem) - Dr. C. Narayana Reddy

ప్రచురణ నెం. : 2328 మొదటి ముద్రణ : 1980

కాపీలు : 2000 రెండవ ముద్రణ : 1990

వి.పి.హెచ్. మొదటి ముద్రణ : జూన్, 1994

" రెండవ ముద్రణ : సెప్టెంబరు, 1994

" మూడవ ముద్రణ : మార్చి, 1996

" నాల్గవ ముద్రణ : ఆగస్టు, 1999

" ఐదవ ముద్రణ : ఆగస్టు, 2002

కవర్ డిజైన్ : చంద్ర

వెల: రూ.40-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్‌బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ISBN: 81-7098-100-X

ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్, విఠల్‌వాడి, హైదరాబాద్ - ఫోన్: 3224831.

# అంకితం

భీమునిపట్నం తాలుకా, పాండురంగి గ్రామంలో జన్మించి

విజయనగరం మహారాజావారికాలేజీ హైస్కూల్లో విద్య నభ్యసించి

పల్లవస్థాయిలో వ్యాపారం ప్రారంభించి, క్రమశః ఆ రంగంలో సమున్నత వృక్షంగా మద్రాసులో అధివసించి

తనకు డిగ్రీలు లేకున్నా, విద్యాసాహిత్యకళారంగాలను సమాదరించి

మద్రాసునగరంలోని ప్రముఖవాణిజ్యవాణీయసంస్థలతో సాన్నిహిత్యం సంతరించి

రాజాలక్ష్మి ఫౌండేషన్ ద్వారా ప్రతియేటా సాహిత్య కళాదిరంగ శృంగాయమానమూర్తుల్లో ఒకరికి పదివేలరూపాయల అవార్డు అందజేసే సముదాత్తప్రణాళిక ద్వారా దక్షిణ భారతంలో అక్షీణ యశస్సును పండించుకుని

తన రసోదారమతితో నా కవితాత్మను వరవశింపజేసిన

ప్రియమిత్రులు

**శ్రీ రమణయ్య (రాజా) గారికి**

ఆప్యాయంగా

# ప్రస్తావన

ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. రంగస్థలం విశాల విశ్వంభర.

ఇతివృత్తం - తేదీలతో నిమిత్తంలేని, పేర్లతో అగత్యంలేని మనిషి కథ.

ఈ కథకు నేపథ్యం ప్రకృతి.

మనిషి ధరించే వివిధభూమికలకు మూలధాతువులు మనశ్శక్తులు.

అలెగ్జాండర్, క్రీస్తు, అశోకుడు, సోక్రటీస్, బుద్ధుడు, లింకన్, లెనిన్, మార్క్స్, గాంధీ - ఇలా ఇలా ఎన్నెన్ని రూపాలో మనిషికి!

కామం, క్రోధం, లోభం, మదం, ఆత్మశోధనం, ప్రకృతిశక్తుల వశీకరణం - ఇలా ఇలా ఎన్నెన్ని విభిన్న ప్రవృత్తులో మనిషికి!

ఆదిమదశనుంచీ ఆధునికదశవరకు మనిషిచేసిన ప్రస్థానాలు ఈ కావ్యంలోని ప్రకరణాలు.

మనిషి సాధన త్రిముఖం - కళాత్మకం, వైజ్ఞానికం, ఆధ్యాత్మికం. ఈ సాధనలో అడుగడుగునా ఎదురుదెబ్బలు. క్షతుడైనా మనిషి తిరోగతుడు కాలేదు. 'విశ్వంభర' కావ్యరచనకు పూర్వం నాలో గీసుకున్న రేఖాచిత్రమిది.

ఈ రేఖాచిత్రాన్ని సువర్ణచిత్రంగా రూపొందించడంలో ఆత్మీయుడు డాక్టర్ ఇరివెంటికృష్ణమూర్తి సహకారం సముచితంగా ఉపకరించింది.

వచనకవితలో ఒక సమగ్రకావ్యం వ్రాయాలనే నా ఆకాంక్ష ఇలా రూపొందింది.

విశ్వమానవేతిహాసాన్నీ, అవధిలేని మనిషి మానసకోశాన్నీ అవగాహన చేసుకున్న సహృదయులకు ఈ కావ్యం సంతృప్తిని కలిగిస్తుందని నా విశ్వాసం.

హైద్రాబాదు

నారాయణరెడ్డి

# మలి ముద్రణ గురించి

కవిగా నా స్థానాన్ని మరింతగా సార్థకం చేసిన కావ్యం విశ్వంభర. ఈ కావ్యం అందుకున్న అవార్డులూ అభినందనలూ ఎన్నెన్నో! విశ్వ విద్యాలయాలు ఎం.ఏ స్థాయిలో దీన్ని పాఠ్యగ్రంథంగా నిర్ణయించాయి. దీనిపై ఎం.ఫిల్, పిహెచ్.డి పట్టాల కోసం పరిశోధనలు జరిగాయి. ఎందరో ప్రముఖ విమర్శకులు లోతైన వ్యాసాలు రాసి ప్రకటించారు. అంతే కాకుండా ఇతర భాషల్లోకూడా దీని అనువాదాలు వెలువడ్డాయి. హిందీలోకి ఆచార్య భీమసేన్ నిర్మల్, ఇంగ్లీషులోకి డాక్టర్ అమరేంద్ర దీనిని సమర్థవంతంగా అనువదించారు. కన్నడ, మలయాళ భాషల్లో అనువాదాలు రూపొంది, ముద్రణకు సిద్ధంగా ఉన్నాయి.

కొంతకాలం నా పేరు చెబితే కర్పూరవసంతరాయలు కావ్యం గుబాళించేది. ఈ కావ్యం వెలువడిన తరువాత ఎందరో సహృదయులు నన్ను విశ్వంభర కవిగా సంభావించారు.

మొదటి ముద్రణ ప్రతులు చెల్లిపోయి దాదాపు దశాబ్దం కావచ్చినా, రెండో ముద్రణ ఎప్పుడెప్పుడని ఎందరెందరో కవితాభిమానులు అడుగుతూనే ఉన్నా, నా బహుళ కార్యవ్యాప్తివల్ల పునర్ముద్రణకు పూనుకోలేదు. జ్ఞానపీఠ పురస్కారం లభించడానికి మూలధాతువుగా నిలిచిన విశ్వంభరను మళ్ళీ ముద్రించాలని పట్టుబట్టి ద్వితీయముద్రణకు ప్రేరకుడూ కారకుడూ అయిన నా పూర్వవిద్యార్థీ, నిరంతరకవితాభిమానీ శ్రీ కె. లింగారెడ్డిగారికి నా ఆశీస్సులు.

భావస్ఫోరకమైన ముఖచిత్రంరూపొందించిన వర్ధమాన చిత్రకారుడు చిరంజీవి హరిశంకర్‌కూ, అందంగా ముద్రించి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత పి. శ్రీనివాస్‌కూ నా అభినందనలు.

హైదరాబాదు.
4-9-1990.

—నారాయణరెడ్డి

# 1

నేను పుట్టకముందే
నెత్తిమీద నీలితెర.
కాళ్ళ కింద ధూళి పొర.
ఆ తెరకు అద్దిన అద్దాల బిళ్ళల్లో
మిణుగురులు కనురెప్పలు మిటకరించాయి.
చిచ్చు ముద్దల్లోంచి
చిమ్ముకొచ్చిన పచ్చి వెలుగులు
పాలమీగడల్లా పరుచుకున్నాయి.
ఆవిరిలో ఆ నీలితెర
అంటుకున్నప్పుడు
అద్దిన బిళ్ళలు చిట్లిపడ్డాయి.
ధూళి పొరలో పొడిచిన
విత్తుల పొత్తికడుపుల్లో
చెట్లు నెత్తురు పోసుకున్నాయి.
కాళ్ళు విరిగి నేలమీద పడ్డ మబ్బులు
మళ్ళీ కాళ్ళను మొలిపించుకున్నాయి.
ఈ పొరలో జడమౌనం
ఒళ్ళు విరుచుకున్నప్పుడు
రెక్కలు, డెక్కలు, మోరలు, కోరలు
దిక్కుల డొక్కల్లో తీండ్రించాయి.

నేను పుట్టకముందు —
ఎంతగా మబ్బులెదురు చూశాయో
చూపుల సోపానాలపై సాగివచ్చి
తమను పిండుకునే ఆ తపన ఏదని.
ఎంతగా నక్షత్రాలు నిరీక్షించాయో
గణితసూత్రాలతో తమ గతుల్ని
మణులుగా కూర్చే ఆ మననం ఏదని.
ఉషస్సులెంతగా
ఉద్వేగపడ్డాయో
విచ్చుకున్న తమ కంటికడలితో
పిచ్చిగా నురగెత్తే విముక్తాత్మలేవని.
వెన్నెలలెంతగా విహ్వాలించాయో
తాము విసిరేసిన వలువల ఒడిలో
తలదాచుకునే మిధునాత్మలేవని.
ఎంతటి కలవరమో వెదుళ్లకు
ప్రత్యంగం నాదంగా పరిణమించాలని.
ఎంతటి ఆరాటమో కొండరాళ్ళకు
అఖిలాణువులు మూర్తులుగా ముఖరించాలని.
ఎంతెంత ఉబలాటమో నెమళ్ళకు
ఏ అడుగులైనా తమ పదలయలను ఏరుకోవాలని.
ఎంతెంత ఉత్కంఠతో కలకంఠాలకు
ఏ గొంతులోనైనా తమ స్వరం తీగసాగాలని.
ఉండి ఉండి సరస్సులు
ఉవ్వెత్తుగా లేచి చూసేవేమో

గోరువెచ్చని శరీరాలను
గుండెలతో తాకి చూడాలని.
పొంగి పొంగి సముద్రాలు
నింగి తండ్రిని అర్థించేవేమో
పసిపాపల్లా ఎదలపై పారాడే
పడవలెప్పుడొస్తాయని.

అప్పుడెప్పుడో నేను పుట్టకముందు—
చిలకల ముక్కుల్లో
చిగురు తొడిగిన పలుకులు;
సుడిగాడ్పుల రెక్కల్లో
పడగలెత్తిన రొదలు -
ఒకటేనేమో !
ముసుగుటాకుల్లో దాగిన
చెట్లముఖాలను మాడ్చే మండుటెండా
మాడిన చెట్ల చెక్కిళ్ళను తడిమి
మళ్ళీ మెరుగుపెట్టే పిండివెన్నెలా -
ఒకటేనేమో !
పొడుపుకొండమీద
శిరసు జెండా ఎత్తి
అడుగేసిన ఉదయం;
పడమటి ఉరికంబం మీద
వెలుతురు తలను వేలాడదీసిన

అస్తమయం -
ఒకటేనేమో !
చీకటి కాగితం మీద
తోకతో అక్షరాలు చెక్కే మిణుగురుపురుగులూ
ఆకాశ శిఖరాల్లో
పాదరసం సెలయేళ్ళను
పాకించిన మెరుపుతీగలూ -
ఒకటేనేమో !
లోతుల్ని లోబరుచుకున్న లోయలూ
ఎత్తుల్ని ఎగరేసుకున్న కొండలూ -
ఒకటేనేమో !
తేనెచుక్కలను కలిపి కుట్టిన ఈగలూ
విషబిందువులకు గూళ్ళు కట్టిన నాగులూ -
ఒకటేనేమో !
ఇంతకూ నేనెవణ్ని ?
ఏ మింటి ఇంటివాణ్ని ?
ఏ కాలం చంటివాణ్ని ?
వెర్రెత్తిన ఏ శక్తి
విసిరేసిన కందుకాన్ని ?
ఎందుకిలా దొర్లుతున్నాను ?
ఈ పొరలను ఒంటికి చుట్టుకుని
ఎందుకిలా నిలువెత్తుగా పొర్లుతున్నాను ?
ఎవరదీ వెన్నంటి వస్తున్నది ?

నేనే తానైనట్టు
నీడలా పలకరిస్తున్నది.
ఆ రూపం
కరిమబ్బులా తరుముకొస్తున్నది
ఆకాశం కౌగిట్లో అదుముకోనా ?
ఆ మూర్తి
వర్షానదిలా ఒరుస్తున్నది
దరుల చేతులతో పొదుగుకోనా ?
ఆ చూపు
చీకట్లను కోసుకొస్తున్నది
పట్టుకోనా గుండెగుప్పిట్లో ?
ఆ నవ్వు
పున్నమలను మోసుకొస్తున్నది
దింపుకోనా దేహదేహళిలో ?
ఆ స్పర్శ వర్షించిన అనుభూతి
అగాధ సుప్తసాగరాల తరంగోద్ధతి.
ఆ పిలుపు అనువదించిన ఆర్ద్రగీతి
హృదయద్వయ సమలయల ఆవిష్కృతి.
అప్పుడు తెలిసింది అవనికి
అంబరాన్ని తాను కప్పుకున్నానని.
అప్పుడు తెలిసింది నిర్ఝరికి
అంబుధిని తాను కట్టుకున్నానని.
గాలి తనను తాను ఆఘ్రాణించుకుంది
పూల ఊపిరులే తన ఒళ్లంతా.

తరువు తనను తాను తడిమి చూసుకుంది
తరుణ లతికల నొక్కులే తనువంతా.
అలా కలుసుకున్న ఆదిమిధునం
అంతరంగంలో ఒక స్మృతివిహంగం.
ఆ స్మృతి తన రెక్కల అంచులతో
గీసిందొక స్వప్నవర్ణచిత్రం.
ఆకృతీ ప్రకృతీ వేరైనా
ఆ చిత్రంలో ఉన్నది మేమే.
అప్పుడు మాకు లేదీ అనుభవముద్ర
అదొక జాగ్రన్నిద్ర.
అప్పుదేదీ ఈ రసాందోళన
అదొక జడచేతన.
అప్పటి చూపు
శిలలపై వీచే గాడ్పు.
అప్పటి స్పర్శ
మంచుగడ్డ నేర్పే మౌనభాష.

నడక ఉంది
అది అడుగులకే తెలియనిది -
పలుకు ఉంది
అది పెదవులకే తెలియనిది
దృశ్యం ఉంది
అది దివారాత్రాలు లేనిది

కాలం ఉంది
అది కదలక పారే నది.
అప్పుడూ ఉన్నాము ఇద్దరం
మింటి తోటలో పూసిన బొమ్మల్లా.
తిరిగే వాళ్ళం గాలితరగల్లా
తెరలెత్తిన పరాగాల నురగల్లా.

అటు కొన్ని చెట్లు
మధురిమలను ఫలాలుగా మలచి ఆహ్వానిస్తూ...
ఇటు ఒకే ఒక చెట్టు
ఎప్పుడూ తన పండును తాకరాదని అనుశాసిస్తూ.
ఆ ఫలాల సాధురుచులతో
అరిగిన మా నాల్కల చిల్కలకు
వద్దని గిరిగీసిన పండుమీద
వాలాలని లేకపోలేదు.

శాసనం ఉరిమితే
చల్లారదు కాంక్ష
అది మరింత రగులుతుంది.
అవరోధం ముదిరితే ఆగిపోదు వెల్లువ
అది మరింత పెల్లుబుకుతుంది.
సహచరి గుండెలో ఒక కోరిక
సర్పంలా తిరిగింది మెలిక.
ఏదో ఒక ప్రలోభం
ఈలవేసింది పూత్కారంలా.

ఏదో ఒక ఊహానుభవం
ఎద తట్టింది భవితవ్యంలా.
ఎంత రుచి ఆ నిషిద్ధఫలానికి
ఎంత వడి ఈ విముక్తహృదయానికి.
ఆకులన్నీ చిలకలై
శాఖలన్నీ శారికలై
విరిసిన కలకలధ్వనుల కొసమెరుపుల్లో
వివేకం విచ్చుకుంది వేకువగా
వేయిరేకులుగా.
ఆ వేకువ చెప్పింది మా అంతస్సులకు
అంతకు ముందెరుగని విజ్ఞతను.
ఆ వెలుగు చూపింది మా కళ్ళకు
అంగాంగంలో జాలువారే నగ్నతను.
కనిపించింది ప్రతివృక్షం
కప్పుకున్న పచ్చనిరెమ్మలతో.
పలకరించింది ప్రతిపక్షి
మలుచుకున్న జిలుగురెక్కలతో.
కదలాడింది ఆకాశం
కట్టుకున్న మబ్బులతో.
ఇద్దరం ఎప్పటివాళ్ళమే.
ఎదురెదురుగా ఉంటూ
దోసిళ్ళకొద్దీ చూపులు వెదజల్లుకున్నవాళ్ళమే.
తనువులు కంటబడగానే
తబ్బిబ్బుపడి

తునిగిపోయే చూపులతో
తుళ్ళిపడి కప్పుకున్నాము పొదలను
తొలిసారి తవ్వుకున్నాము ఎదలను.

'ఏయ్ ! ఎక్కడున్నావు నువ్వు?'
'ఈ పొదతో గతాన్ని కప్పుకున్నాను.'
'ఏ ప్రలోభం మాయ చేసింది నిన్ను?'
'ఇప్పుడిప్పుడే తెరుచుకుంది వెలుతురు కన్ను.'
'ఈ గొంతు నీది
మరి ఏదీ నీ సహచరిది?'
'పలికే ఈ గొంతులో
ప్రతిశబ్దం ఇద్దరిది.'
'తెలుసా !
శాసన ధిక్కారానికి ఫలితం?'
'తెలుసు -
మట్టిలా మొలకెత్తే మరోజీవితం.'
'ఆ జీవితానికి
అనుక్షణం మృత్యుభయం!?'
'ఆ మృత్యువు కోరలతో
ఆడుకోవడం మాకు ప్రియం.'
'అయితే వెళ్ళిపో మట్టిమనిషీ!
ఆ మట్టిలోకి.'
'అలాగే;
వెళ్ళి పొంగిస్తాను ఆ మట్టిని నింగిపైకి.'

'అందాకా వచ్చిందా నీ అహంకృతి?'
'అక్కడే మొదలవుతుంది
మానవ సంస్కృతి.'

మట్టిలో పడ్డాను
మౌనంలా నిలబడ్డాను
ఎదురుగా ఉదయసూర్యుడు.
ఎక్కడివాడో?
నాలాగే ఎదిగి వస్తున్నాడు.
వేయిచేతులతో ఈదుతున్నాడు
వినువీధుల పాథోధులను.
బురద నవ్వింది కమలాలుగా
పువ్వు నవ్వింది భ్రమరాలుగా
పుడమి కదిలింది చరణాలుగా
జడిమ కదిలింది హరిణాలుగా.
నీటికి రెక్కలు మొలిచి నింగినందుకుంది.
నింగికి అడుగులు కదిలి నేలనందుకుంది.
నేనూ నడుస్తున్నాను
మడమ తిప్పని మార్తాండునిలా
విహంగాల కూజితాలను విసిరేసుకుంటూ
ప్రవాహాల తుషారాలను ఎగరేసుకుంటూ.
నడుస్తున్నాయి నన్నంటి
తరుశిఖలు తలలూపుకుంటూ

వనవల్లికలు హల్లీసకమాడుకుంటూ
చిరుతపచ్చికలు చిటికలేసుకుంటూ.
పయనిస్తున్నాయి నా వెంట
పవన తరంగిణులెన్నో
గుహల గుండెలను పలికించుకుంటూ
కుసుమబృందాలను నడిపించుకుంటూ.

'మిత్రమా!
నీ రాకతో ధాత్రి నవచైతన్యగాత్రి.
అప్పుడా!
నీ రేఖతో ప్రకృతి రూపెత్తిన ద్యుతి.
ఆగవయ్యా! ఒక్క క్షణం
అవనీతలం నీకు పట్టిన అద్దం.
ఎలా కందిపోయావో చూసుకో
ఎంత అలిసిపోయావో ఉండిపో.
ఏమిటది
అలా దిగబడుతున్నావు
అగుపించని అడుసులో.
ఎందుకని
కరుకు నలుపు చొరబడుతున్నది
మెరిసే నీ యెరుపులో.
ఏ నైల్యం కమ్మేసిందో నా కళ్ళను
ఏ చీకటి మింగేసిందో ఈ వెలుగును.

ఏడీ ?

నా [illegible] ?

వ్యోమానికీ భూమికీ ఉన్న
సీమలను చెరిపేసిన
ఆ విశ్వామిత్రుడేడీ ?
ఏవీ నాతో కదిలొచ్చిన
పక్షులూ ప్రసూనాలూ ?
అంధకారం పంజాదెబ్బకు జడిసి
ఆకాశానికి అతుక్కున్నాయా
బిక్కు బిక్కుమంటున్న చుక్కలుగా.
ఎక్కడున్నాడు
నాతో నడిచిన జగన్నేత్రుడు ?
చుట్టుముట్టిన చీకట్లదాడికి
తట్టుకోలేక పారిపోయి
తలదాచుకున్నాడా శూన్యంలో
వేడిచచ్చిన వెన్నెలదిబ్బగా.
ఇక నేనూ ఇంతేనా ?
కుంటుతున్న ఒంటరితనంతో
కుప్పగూలుతున్న ఆశల నీడ్చుకుంటూ
రొంపిలాంటి చీకట్లోపడి
రొప్పుతూ పోవడమేనా?
ఈ మూల్గులే రొదలై
ఆ రొదలే ఆర్త్రఘోషలై

చిమ్ముకుపోవా నిశిని
చీల్చుకుపోవా రోదసిని ?'

నా ఘోష విన్నదా అంబరం
ఔనన్నదా దిక్కుహరాంతరం.
పొడుచుకొచ్చింది అదే భానుబింబం
పొంగుతున్న ఆశాపూర్ణకుంభం.
తొణికిన ఆ పూర్ణకుంభం చినుకులే
తొలకరిస్తున్నాయి చిగుళ్ళుగా
కురిసిన ఆ తరుణకిరణకణికలే
విరిసిపోతున్నాయి కళికలుగా.
ప్రతి తరువూ ఎదుగుతున్నది
పచ్చని శ్వాసలతో.
ప్రతి పువ్వూ పలుకుతున్నది
పరిమళ భాషలతో.
సాగుతున్నది నా సహచరి
తీగలు వెయ్యి మెలికలు తిరిగిపోగా.
నవ్వుతున్నది ఆ రసఝరి
పువ్వులు పదునెక్కి దూసుకురాగా.
నన్ను చేరింది సుతిమెత్తగా
నరాల్లో మెరుపులు సాముగరిడీలు చేయగా.
నన్ను తాకింది చిరుకొత్తగా
నా సర్వం తీయనిగర్వంతో పడగెత్తగా.

ఏమి అనుభూతి ఇది
ఎదలోతులు ఎగిసెగిసిపోయినట్టు
రక్తంలో అవ్యక్తరాగాలు రంగరించినట్టు.
ఏమి చిత్రవాంఛ ఇది
ఎదుట ఉన్న సొగసులన్నీ తాగేయాలన్నట్టు
పరిమళాల మంటల్లో పడి చావాలన్నట్టు.
ఉన్నాను నా సహచరి ఒడిలో—
ఊపిరిలో ఊపిరి మునకేసింది.
ఉన్నది రసఝరి నా ఒడిలో—
కాలం లిప్తగా కరిగొచ్చింది.
పారవశ్యం పక్కా దొరిలించింది.
ప్రకృతి మరోపార్శ్వం చూపించింది

ఏమిటిది ?
ఈ నదీ గర్భంలో
ఎడారి పడుకున్నది.
పొంగే అలలను మింగేసి
మండుటిసుకను నెమరేస్తున్నది.
ఏమిటిది ?
కరుచుకున్నాయి మంచుగడ్డలు
పరుచుకున్న పచ్చికబయళ్ళను.
ముసురుకున్నాయి పొగలపొరలు
మెరిసే దిశల నొసళ్ళను.

ఏమి చేమిటిది ?
నిలిచిపోయిందా ఈ చెట్లశ్వాస
నిలబడ్డాయి శవాల్లాగా.
బిక్కు బిక్కుమంటున్నాయి పూలూ ఆకులూ
రెక్కలుమాడిన పురుగుల్లాగా.
ఇక నేనూ ఇంతేనా ?
ఇసుకకుప్పలా కూలిపోయి
మంచుగడ్డలా బిగుసుకుపోయి
తనువును పచ్చగా పలికించిన
ఊపిరిని కోలుపోయి
పుడమిపై శాశ్వతస్థాణువునై
పడి ఉండడమేనా ?
మెదడును తొలిచేస్తున్న
సంశయాల మధ్య
గుండెను పిసికేస్తున్న
భయాల మధ్య
ఒంటిలో ఎదురునడుస్తున్న
రక్తనాళాల మధ్య
ఊహలో హోరెత్తుతున్న
గ్రహభ్రమణాల మధ్య
కాదన్నది ఎలుగెత్తి జీవనది.
కాదన్నది పువ్వుల్ని పుక్కిలిస్తూ
కదిలివచ్చే వాసంత సంజీవనీహ్రాది.

సృష్టికుదుళ్ళను తవ్విచూపింది
జీవప్రకృతి.
విశ్వంభరను తెరతీసి చూపింది
వినూత్నమతి.
జెర్రిపోతుల్లా పాకే చీకట్లు
చీకట్లను పడదోసే వెలుగుమెట్లు
దిక్కుల్ని కబళించే ఎడారులు
ఎడారుల్ని మచ్చికచేసే పచ్చికదారులు
కొమ్మలను కొరికేసే మంచుకోరలు
పడిన గాట్లలో పచ్చదనం నింపే
వసంత పవన ధారలు
అవ్యక్తంగా ఆకృతి దిద్దుకునే
నెత్తుటిముద్దలు
ఆ ముద్దలకు కేరున ఏడ్చే
పాలగొంతుకలు
పదును పెదవులకు ముడిపడే
పారవశ్యాలు
ప్రపంచాన్ని కుదిలించే
పంచేంద్రియాలు
శరీరపంజరాన్ని కొరుక్కుతినే
శైథిల్యాలు
నిరాశల రొంపిలో కూరుకుపోయే
సర్వావయవాలు.

ఒక దేహం మట్టిలోకి
ఒక జీవం మట్టిపైకి.
ఇదీ క్రమం ప్రకృతికి.
ఇదే క్రమం
ప్రకృతిని అర్ధాంగిగా
మలుచుకున్న
ప్రతి పురుషునికి.

ఇప్పుడు తెలిసింది
నిప్పును ఊదేసే నీరుంటుందని
నీటిని ఎగరేసే నిప్పుంటుందని
పూలను పొడిపించే ముళ్ళుంటాయని
ముళ్ళను ప్రశ్నించే పూలుంటాయని.
ఇప్పుడు తెలిసింది
గుడ్డిచీకటికీ
ఆకాశంనిండా కోటి కళ్ళుంటాయని
సూర్యచంద్రుల్ని చప్పరించి వదిలేసే
సూక్ష్మ శక్తులుంటాయని.
అడుగు నేలపైఆనని యవ్వనం
అడుసులోకి దిగబడుతుందని.
నిత్యదీప్తమని అనుకున్న జీవితం
లిప్తలో ఆరిపోతుందని.

కదులుతున్నాయి మనిషి గుండెలో
గాండ్రించే అరణ్యాలు
గీపెట్టే సముద్రాలు
తీండ్రించే జలపాతాలు
తిరగబడే ఝంఝూమారుతాలు
గట్లకు కాట్లువేసే నదుల బుసబుసలు
గిరుల వేళ్ళను పెళ్ళగించే భూగర్భం రుసరుసలు
విస్మయం వేయినోళ్ళతో అరిచింది
భయం లక్షగోళ్ళతో చరిచింది.
ఆకాశం పగిలినంత శబ్దం
విచలించే మనిషికి
వెన్నుదట్టే చినుకులు.
ఆ అనుభూతి అమృతం
అయినా అది క్షణికం.
ఆకాశం కూలిపడ్డంత వర్షం.
చెట్టు గొడుగయ్యింది
చిట్లిపోయింది కాసేపట్లో
నడినెత్తిన మంటలతో.
గుహాగుండె తెరుచుకుంది
కొండంత జాలితో.
మళ్ళీ కుదుటపడ్డ మనసుకు
గుహలో మబ్బులాంటి గాండ్రింపు.
లంఘిస్తున్న రెండు అగ్నికణికలు.

ఒక్కక్షణం దిక్కుతోచని హోరు.
గుహవెలుపలికి చిమ్ముకొచ్చిన మనిషికి
గోళ్ళుదిగిన పచ్చిగుర్తులు.
గుహలోని గోళ్ళకు జడిసిన మనిషికి
గూడయ్యింది ఏటిగట్టు.
జాలువారే ఆ యేరు తోచింది తనకు
పాలవేళ్ళతో నిమిరినట్టు.
గుహ దూసుకొచ్చింది గుడిసెలోకి.
గోటికి ఎదురు ఈటె
కోరకు ఎదురు ఖడ్గధార.
ఆత్మరక్షణకు నేర్చుకున్న
ఆదిపాఠమది.
మృత్యుహత్యకు వేసుకున్న
మూలపీఠమది.
ఏటి లాలింపు ఎంతవరకు?
నీటికి పోటు పుట్టేవరకు.
గుడిసె తేలింది ఎండుటాకులా
మనిషికి మిగిలింది మరో ప్రశ్నగా.
ఇల్లు మొలిచింది ఇటుకే కండగా
ఇనుమే అండగా.
పడిపోయింది గుహనోరు
జడిసిపోయింది వరదహోరు.
కాలాన్ని తొడుక్కున్నాడు మనిషి
కత్తిరించి కుట్టువేసి.

పృథివిని తిప్పుకున్నాడు మనిషి
నాలుగు దిక్కులను నాటేసి.
ఏటిని చీల్చాడు రెండుగా
ఈటెల్లాంటి చేతులతో.
నడిచాడు కడలి అంచుపైన
పడవల అరికాళ్ళతో.
చొరబడ్డాడు గిరుల గుండెల్లో
సూదికంటిలో దారంలా.
తెగబడ్డాడు గహనాటవుల్లో
సెగ విసిరిన బాణంలా.
కొయ్యల రాపిడిలో రాలే నిప్పును
కొనగోటితో చిలికించి
బిగుసుకుపడివున్న నేలను
చిగుళ్ళ నోళ్ళతో పలికించి
అడవిలో పూసే అందాలను
అంగణంలో నాటించి
కోరల మధ్య అదిరే జీవాలను
ఊరి ఒడిలో పెంచుకుని
తిరిగే చక్రాల ఉరవడిలో
పరుగుబతుకు మలుచుకుని
పచ్చిగా పారే నీటిని
పండు మనసుతో పిలుచుకుని.
విస్తరించాడు మనిషి
విశ్వాన్ని ఆత్మీకరించుకుని.
ఆవరించాడు మనిషి
అంబరాన్ని పిడికిలించుకుని.

# 2

మనిషి మనసులో ఒక సుప్రభాతం.
మౌనాన్ని పెకల్చుకుని
మగతను చీల్చుకుని
ఊర్ధ్వంగా ఎగిసే
ఉన్మత్తనాద జలపాతం
ఎక్కడిదీ నాదం ?
నాభిపాదులో పుట్టిందా
నరాల్లో తీగలు తీగలుగా చుట్టిందా
గుండెలోయలో ఘూర్ణిల్లిందా
మస్తిష్కం అంచులో
మారోమ్రోగిందా?
ఎన్ని ఒదుగులు దీనికి
ఎన్ని పరుగులు దీనికి.
ప్రకృతిలోని ఘోషలన్నిటికీ
పాఠాంతరమా ఇది?
ఎక్కడో ఒక వసిమికోనలో
పిక్కటిల్లిన క్రేంకారం;
అది నాదగర్భం ప్రసవించిన షడ్జం.
ఎక్కడో ఒక మబ్బునీడలో
ఎలుగెత్తిన చాతకశ్రుతి;
అది నాదవర్షం ప్రసరించిన ఋషభం.

ఎక్కడో ఒక పచ్చికపట్టులో
చిక్కవిడిన మేషస్వరం;
అది నాదక్షోణి స్పందించిన గాంధారం.
ఎక్కడో ఒక ఏటిగట్టులో
రెక్కలెత్తిన క్రౌంచకంఠం;
అది నాదమారుతం మీటిన మధ్యమం.
ఎక్కడో ఒక కొమ్మఒడిలో
ఇగురులెత్తిన కుహూరావం;
అది నాదతరువు పరిమళించిన పంచమం.
ఎక్కడో ఒక నీటిపడియలో
పుక్కిలించిన భేకధ్వని;
అది నాదసరసి తరగెత్తిన ధైవతం.
ఎక్కడో ఒక కొండకనుమలో
దిక్కులను ఆదిలించిన ఘీంకృతి;
అది నాదరోదసి నినదించిన నిషాదం.
తనలో పొంగిన పాయలు ఏడు
తానో స్వరసంగమం.
తనలో పారిన గాడ్పులు ఏడు
తానో ప్రాణసంపుటం.
ప్రకృతిలోని మూలనాదమే
పెకలి వచ్చిందా తనలోకి?
తనలోని జీవనాదమే
తరలిపోయిందా ప్రకృతిలోకి?

తన ఊపిరి శ్రుతిగా సాగినప్పుడు
వెదురు నడిచొచ్చింది వేణువుగా.
తన గోళ్ళలో పులకలు పూసినప్పుడు
ఇనుము కరిగొచ్చింది వీణియగా.
తన వేళ్ళలో తరగలు వీచినప్పుడు
తోలు కదిలొచ్చింది డోలుగా
కంచు కలిసొచ్చింది తాళంగా.

ఎన్ని అంచులో రాగాత్మకు?
ఎన్ని అలలో నాదాత్మకు?
సభాసరసిలో విరిసింది పద్మంలా
సమరావనిలో మొరసింది శంఖంలా—
పంటచేలను పలికించింది ఏలలా
పాలనిదురను పిలిపించింది జోలలా
ఆలయాలను వెలిగించింది హారతిలా
ఆర్తిని అనువదించింది ఆర్ద్రకృతిలా
నిలిచింది ధరాగగనాలకు నిచ్చెనలా
కలిపింది అంతరంగాలను వంతెనలా
చొరబారింది స్థాణువుల్లో జీవలహరిలా
విరబూసింది గుబురుచీకటిలో దీపకళికలా
కరిగించింది కొమ్ములను మైనంలా
ఊగించింది పడగలను మంత్రంలా.

ఒక నిశీథంలో
నడుస్తున్నది రాగాత్మ నదీతీరంలో.
పసితనం పరవశించిన
రెండు చీకటికళ్ళు ఈదుతున్నాయి
పండువెన్నెల పారావారంలో.
'ఎంత బాగుందీ వెన్నెల
ఎంత ఈదినా తీరదు తృష్ణ.'
'ఎలా ఉంటుందో వెన్నెల ?'
జాలిగా మూలిగిందొక ప్రశ్న.
రాగాత్మ ఎదుట నిలిచింది ఆ పసితనం
చూపుల పురిటిళ్ళలో
శూన్యాన్ని మోసుకుని.
రాగాత్మలో తీగసాగింది తపన
చీకటికళ్ళకు వెన్నెల వెల్లువ చూపాలని.
పెల్లుబికింది రాగాత్మ
తల్లి వెన్నెలలా.
ఎగిసింది పాలవెన్నెల
నాదనిర్ఝరిగా.
నినదించిన ఆ నిండు వెన్నెల
అనిపించింది పాపకు
మల్లెరేకలుగా
పాలవాకలుగా
నీహార యవనికలుగా

శరన్నీరద మాలికలుగా
కలహంస రెక్కలుగా
కరగబోసిన చుక్కలుగా.
విరిసింది పాపమనసులో
వెన్నెల చూసిన అనుభూతి.
వినిపించింది పాపకళ్ళలో
విశ్వం గేసిన చిత్రగీతి.

మనిషి మనసులో ఒక ప్రకంపనం.
అడుగుల్లో శిరసెత్తి
అంగాంగాల్లో అలలెత్తి
సుప్తచేతనకు జడలు విదిల్చిన
దీప్తలయ స్పందనం.
అరికాళ్ళలో చొరబడ్డాయి
ఉరకలు తీసే వేళ్ళు.
చరణాలలో పురివిప్పాయి
సంభ్రమించే నెమళ్ళు.
నడుములో మెలికలు తిరిగాయి
పడగెత్తి ఆడే నాగినులు.
కరయుగళిలో మలుపులు తిరిగాయి
నురగలెత్తే గిరివాహినులు.
గళం ఊగింది తరుశాఖలా
శిరం కదిలింది అగ్నిశిఖలా.

ఎక్కడిదీ చలనం ?
ఎందుకింత లయోల్బణం ?
ఇది సృష్టికి జీవహేతువు
ప్రకృతి పురుషులకు మూలధాతువు.
ఉండలేదు భూమి తిరగనిదే
నిలవలేదు నీరు పారనిదే
దాగలేదు వెలుగు తరలనిదే
ఆగలేదు గాలి కదలనిదే.
ఊరుకోలేదు ఉనికిలేని గగనం
గ్రహతారకలు చరణాలుగా
అహర్నిశలు పరిభ్రమించనిదే.
తన తనువులో ఉన్నది ఆ భువనమే
తన శ్వాసలో ఉన్నది ఆ పవనమే
తన రుధిరంలో ఉన్నది ఆ ప్రవాహమే
తన కళ్ళలో ఉన్నది ఆ ప్రసారమే
తన శిరసులో ఉన్నది ఆ చలనమే.

ప్రకృతిలోని చలన శీలానికి
పరిణామం మనిషి
జగతిలోని భ్రమణగుణానికి
ప్రతిరూపం మనిషి.
పాటలా సాగిన మనసు
ఆటలా ఊగిన మనసు

మాటలను కప్పుకునీ
అర్థాలను అల్లుకునీ
పలికింది అనంతముఖాలుగా
ఒలికింది విభిన్నగళాలుగా.

చీకట్లో కనిపించదు చేతిసైగ
వేదనో వేడుకో తెలుపలేదు వెర్రికేక.
పొంగులెత్తే గుండెను పట్టిచూపలేదు
పొడి పొడి మాట.
ఎలా విప్పేది మనసుపొరలను?
ఎలా బొమ్మ కట్టేది ఊహలతెమ్మెరలను?
బదులు పలికింది ప్రకృతి
'ఇదిగో నేనున్నా'నని.
మదిలోని ప్రతి కదలికనూ
పెదవికి రప్పించుకొమ్మని.
తనలో ఒక కల్లోలం—
ఘోషించింది కడలికెరటం.
తనలో ఒక ఉల్లాసం—
పులకించింది పున్నమికిరణం.
తనలో ఒక వేదన—
ఎదురొచ్చింది శ్రావణమేఘం.
తనలో ఒక గర్జన—
ఎగిరిదూకింది కొదమసింగం.

తనలో ఒక మాధుర్యం —
బాసలాడింది రాసనిలయం.
తనలో ఒక మాత్సర్యం—
ఆవులించింది ధూమవలయం.
తనలో ఒక నియతి —
నిలిచింది నిస్తరంగ సరసి.
తనలో ఒక వికృతి—
కమ్మింది అమావాస్య నిశి.
ప్రకృతి పలికింది కృతిగా
కృతి నిలిచింది మానసాకృతిగా.
కదిలిపోతున్నది మనసుతెరమీద
కవితాత్మ పరమహంసలా—
కాలం పొరలు విప్పుతూ
లోకం లోతులు తవ్వుతూ.
అరిచిన బలిపశువు కంఠం
ఉరిమింది వరుణమంత్రంగా.
గుండెపగిలిన తమసాతీరం
ఘూర్ణిల్లింది శోకచ్ఛందంగా.
చెమ్మగిల్లిన విరహం చేయిసాచి
కమ్ముకుపోయింది ఆషాఢమేఘంగా.
చూపునోచని నయనం
ఊహసాచి రూపెత్తింది
పోగొట్టుకుని పొందిన స్వర్గంగా.

కవితాత్మ వెలిగించింది గుళ్ళలో
కర్పూరనీరాజనాలను.
ఆగ్రహించిన ఆ కవితాత్మ
ఆర్పేసింది రెక్కవిసిరి
మతాలు చిందించిన
మనుషుల రక్తాన్ని
ఘృతంలా దిగమింగే దీపాలను.
కవితాత్మ అక్షరాలు తొడిగింది
కమనీయ రాసరహస్యాలకు.
విక్రమించిన ఆ కవితాత్మ
వినిపించింది విహాయసమంటి
కర్మక్షేత్రంలో కాళ్ళువణికిన నరులకు
నిష్కామకర్మ భాష్యాలను.

కవితాత్మ కలకలలాడగా—
ముఖాలలో పద్మాల పునర్ముద్రణలు
కళ్ళలో కలువల కలభాషణలు
పెదవులపై పండువెన్నెల ప్రచురణలు
చెక్కిళ్ళలో చిగురుకెంపుల ప్రసరణలు.
కవితాత్మ విలవిలలాడగా—
ఆకులు డుల్చింది హరితవృక్షం
ఆకాశం రాల్చింది జలదబాష్పం
రాత్రిని ఆవరించింది కృష్ణపక్షం

ధాత్రిని ఆవహించింది ధూమగాత్రం.
కన్నెర్రజేసింది కవితాత్మ —
కట్టెపుల్లలు కరవాలధారలుగా
మట్టిముద్దలు మహాగ్నిగోళాలుగా
గొర్రెగొంతులు శార్దూలఘోషలుగా
బొమికలగూళ్ళు ప్రభంజన శ్వాసలుగా.
గళమెత్తి పాడింది కవితాత్మ —
కత్తిమొనలు నాగలికర్రులుగా
శూలాలు మోగే కలాలుగా
ఎడారులు పచ్చల గీతాలుగా
ఇనుపడేగలు రజతకపోతాలుగా.

పారింది మనిషిమనసు రంగుల్లోకి
పాకింది లలితమతి రేఖల్లోకి.
కదిలివచ్చింది ప్రకృతిసర్వస్వం
కలలుకనే మునివేళ్ళలోకి.
మురిగిపోయే తోళ్ళమీద
మొలుచుకొస్తున్నాయి
సురభికుసుమలతలు
తరుణచంద్రద్యుతులు.
పలకబారిన కొయ్యలమీద
ప్రవహిస్తున్నాయి
సెలయేళ్ళ మెలికపరవళ్ళు
పసిలేళ్ళ అలలకాళ్ళు.

వట్టి మట్టిపాత్రల ముఖాలమీద
పుట్టుకొస్తున్నాయి
అప్సరోంగనల నయనభంగిమలు
ఆకాశానికందని తరళనీలిమలు.

అల్లుకున్న దూదిపోగులఅంచులమీద
పెల్లుబుకి వస్తున్నాయి
చిక్కని ఇంద్రధనుర్వర్ణవాహినులు
మొక్కవోని మధుమాసహాసవనులు.

ఆకుల మీద
రేకుల మీద
గోళ్ళ మీద
గోడలమీద
కత్తుల ఒరలమీద
కాగితం పొరలమీద
చేతి కర్రలమీద
తంబురా బుర్రలమీద
రెక్కలెత్తి ఎగిసింది
డెక్కలెత్తి నడిచింది
పడగలెత్తి నర్తించింది
గొడుగులెత్తి వర్తించింది
కదిలే ఆకృతులను రేఖల్లో
కుదించిన చిత్రకళాత్మ.

కుసుమించిన రూపాలలో చైతన్యం
కుమ్మరించిన స్నిగ్ధవర్ణాత్మ.

పడుకున్నది మనసు ఒకనాడు
పర్వతం ఒడిలో.
కరిగిపోతున్నది తానున్న శిలాతలం
కలలాంటి తాకిడిలో.
ఏవీ ఆ కొండరాళ్ళు
ఏవీ ఆ శిఖరాలు
అగుపించవే ఆ లోయలు
ఎగిసిపోయెనా ఆ గుహలు?
పరిభ్రమిస్తున్నాయి తన చుట్టూ
పసిడిముద్దలు
మైనపుగుంజలు
పాలనురగలు
దూదిపింజలు.
కట్టెదుట నిలిచిన లోయలో
కల విరిగింది.
ఉలిక్కిపడ్డ మనసులో
ఉలి మెరిసింది.
నడిచింది ఉలి
జడకట్టిన అడవులను విదిలిస్తూ.
కదిలింది ఉలి
కందరాల మూతికట్లను విప్పేస్తూ.
తట్టింది ఉలి
పుట్టుకతో నిద్రిస్తున్న మొండివీపులను.

తడిమింది ఉలి
ముడులు విప్పుకోలేని బండచూపులను,
శిల పలికించింది
నిలువెత్తునా నిశ్శబ్దరాగాకృతులను,
శిల సవరించింది
చెక్కిళ్ళపై పెళ్ళపడుచుల మేలిముసుగులను.
శిల చిందించింది
చేదుకన్నీట తడిసిన నిట్టూర్పులను.
శిల రగిలించింది
శివమెత్తిన బరికత్తుల చిచ్చుసౌసళ్ళను.
తనను తొలుస్తున్న మనిషితో
తాదాత్మ్యమెందుకో శిలకు ?
సర్వాంగాలను పొడుస్తున్న ఉలితో
సహయోగమెందుకో శిలకు ?
బెబ్బులులు బొబ్బరించిన తనలో
బింబాధరాలను పలికించినందుకా ?
విషసర్పాలు పూత్కరించిన తనలో
వెన్నెలతీగలను మొలిపించినందుకా ?
పరవశించింది శిలాప్రకృతి
పల్లవించింది స్వప్నాకృతి
అమృత స్నిగ్ధంగా
ఆత్మకు అద్దంగా.

కానల్లో అవతరించిన కైలాససదనాలు
కోణంలో ప్రతిఫలించిన ఆదిత్యచరణాలు
అనంతంలో అందెవేసిన ఆనంద తాండవహేలలు
దిగంతంలో రంకెవేసినదీప్త చైతన్యలీలలు
బుట్టపలకలో కట్టుపడిన చపలనాగినులు
చెట్టునీడలో వెలుగులొలికిన ధ్యానవాహినులు
పాలవన్నెలో గడ్డకట్టిన అశ్రుగీతులు
కేలెత్తి నిటారుగా నిలిచిన అమరజ్యోతులు
కాలం మూలంలో పుట్టిన సంగతులు
కాలాతీతంగా కట్టిన కథాకృతులు
ప్రతీకలుగా దిద్దుకున్న విశ్వాసాలు
రాచగోరీల్లో తొక్కిపెట్టిన నిశ్వాసాలు
ముద్రలుగా మూర్తికట్టిన జననరహస్యాలు
మూడుకాలాల్లో కళ్ళకు తట్టిన జీవనదృశ్యాలు-
శిల్పాత్మను దర్శించిన ముకురాలు
జీవాత్మ విసిరేసిన శకలాలు.
మనిషి మనసు చూసుకుంది
తన నీడను అగణ్యరూపాలుగా.
రసాహంకృతి కూర్చుకుంది
రక్తిని చైతన్యకోశాలుగా.

# 3

ఎంత వింతమనసు?
ఏ రూపమూ లేదు తనకు.
అయినా అది
నాదంగా ఎగిసింది—
పదంగా నడిచింది
రేఖలుగా మెరిసింది
మూర్తులుగా నిలిచింది
అణువణువులోని లయలను
తనువులో ఒలికింది.
మదిరాక్షి కళ్ళలో మునకలేసింది
పెదవిముడి విప్పిచూసింది
తెరలు తెరలుగా
పరిమళాలను కాజేసింది.
పొరలు పొరలుగా
సుస్వరాలను లాగేసింది.
మెత్తని వేళ్ళకొసలతో
మేనినునుపును వడబోసింది.

మనసొక రోదసి;
పిడుగుల అడుగులు పడుతుంటాయి
మెరుపుల చురకలు అంటుతుంటాయి.

జాబిల్లి కమ్మెచ్చులో లాగిన వెన్నెలలు
తీగలై సాగుతుంటాయి.
సూర్యుని కంటికొలిమి నూదిన చిచ్చుకణికలు
పచ్చిబొగ్గులై పడిపోతుంటాయి.
రోదసికి తెల్లపూత పూస్తే
అది వెలుగు.
రోదసికి నల్లరంగు పులిమితే
అది చీకటి.
మనసుకు గజ్జెలు కట్టుకుంటే
తెరలేస్తుంది.
మనసును ఆవులింతలు చుట్టుకుంటే
తెర వాలుతుంది.
ఊగిపోవాలనుకుంటుంది అది
ఉయ్యాలలౌతాయి మబ్బులు.
మోగిపోవాలనుకుంటుంది అది
మృదంగాలౌతాయి ఉరుములు.

మనసొక వృక్షమూలం;
అది చేదుకుంటుంది
అగుపించని పొరల్లోని జీవసారం.
పగలబడి నవ్వుతుంది
చిగుళ్ళు విప్పారిన రేకులౌతాయి.

కుమిలికుమిలి ఏడుస్తుంది
ఆకులు
జలజలరాలే మంచుబొట్లవుతాయి.
నెత్తినిమాడ్చే మంచుటెండల్లో
నీడలజల్లులు కురిపిస్తుంది.
తననుముక్కలుగా నరికే గొడ్డలికి
తానే ఆధారంగా నిలుస్తుంది.
తాను నేలలో దిగబడివున్నా
తన బిడ్డల్ని గాలిలో ఎగరేస్తుంది.
కాలం తన కళ్ళలో దుమ్ముచల్లినా
కదలని కాళ్ళతో నిలిచిపోతుంది.
ఎప్పుడూ కుదురుపీడని మనసు వేళ్ళను
అప్పుడప్పుడు ఆశ తొలుస్తుంది
కొమ్మల చేతులెత్తి ఆడాలని;
చిగురాకుల జేబురుమాళ్ళను ఊపుతూ
పథికుల కళ్ళను పలకరించాలని.
వేళ్ళకొసలు పెళ్ళగించుకుని లేస్తే
వృక్షమాతృక కూలబడుతుంది.
ఆశల అంచులు పొగరేపుకుంటూ వస్తే
అంతరంగం కూరుకుపోతుంది.

మనసొక మహాసాగరం;
తాను కట్టుకున్న చెలియలికట్టను
తానే కబళించాలని చూసుంది.

తన తోబుట్టువైన ధరాతలాన్ని
తానే తాగేయాలని చూస్తుంది.
హోరెత్తుకుంటూ ఉరికిఉరికివస్తుంది.
నోరొత్తుకుంటూ తిరిగితిరిగిపోతుంది.
తనలో అంబరాలను పరుచుకుంటుంది.
తానే ఆకాశమంతా కమ్మేయాలని
తహతహలాడిపోతుంది.

నదులను తనలో కలుపుకున్నా
మధురిమలెన్నెన్నో నింపుకున్నా
తనకు నిలిచిన రూపమొక్కటే
తనకు మిగిలిన రుచి ఒక్కటే.
అనంత జలరాశి తానైనా
ఆర్పుకోలేదు తనలోని చిచ్చును.
తనపై ఎంత తెలుపు కురుస్తున్నా
మాపుకోలేదు తన మేనినలుపును.
హిమగిరులపై ఎగిసే మనసే
ఇరుకులోయల్లో చొరబడుతుంది.
అరుణోదయాలను ప్రతిష్ఠించే మనసే
పిరికిచీకట్లలో దిగబడుతుంది.
పసిమిని తెగమేసి
ఇసుకను నెమరేసుంది.

మందుటిసకను మింగేసి
మాగాణులను పుక్కిలిస్తుంది.
విత్తుగా ఉంటూనే
వృక్షమై కూచుంటుంది.
అంతరిక్షంగా ఉంటూనే
అణువులా కుదించుకుంటుంది.
అది అగమ్యం
అన్వేషిస్తుంది గమ్యం.
అదొక శూన్యం
అవలోకిస్తుంది కామ్యం.
అది కాలాతిరిక్తం-
ఆరు ఋతువులు ఒక లిప్తలో.
అది యోగాభిషిక్తం-
ఉదయాంశువులు ఆ సుషుప్తిలో.
ఎప్పుడు చినుకౌతుందో
ఎప్పుడు పిడుగౌతుందో
ఎప్పుడు అడుగేస్తుందో
ఎప్పుడు మడుగౌతుందో
ఎప్పుడు నవ్వుతుందో
ఎలా ఎలా నవ్వుతుందో.
తెల్లగా నవ్విందా
తెరచాపలెత్తే జ్యోత్స్నాసరిత్తులు.
నల్లగా నవ్విందా
నాగఫణాలెత్తే విషమరాత్రులు.

పచ్చగా నవ్విందా
పగుళ్ళువారిన నేలలో
పల్లవజయంతులు.
ఎఱ్ఱగా నవ్విందా
వెఱ్ఱెత్తి అరిచే రుధిరస్రవంతులు.
రాజసముద్ర విడలేని మనసు
రాజుకున్నది ఒకనాడు
పరిపూర్ణ సత్త్వలబ్ధికి
పొరలులేని సత్యసిద్ధికి.
సాగుతున్నది ఆ తపస్సు
క్షణాల శిఖరాలు దూకి
దినాల గహనాలు దాటి
కాలఘట్టాలను చీల్చుకుని
వేలావలయాలను విదిల్చుకుని
సమున్నత లక్ష్యసాగర
సంగమం కోసం.
నిలిచివున్నది ఆ తపస్సు
నిరంతర వరాఘాతంలో గుహాగర్భంలా
నితాంత హిమపాతంలో మిహిరబింబంలా
ఉదగ్ర నిదాఘతాపంలో వటచ్ఛాయలా
ఉన్మత్తఋతులకు చెదరని
ఉదాత్త హృదయస్థాయిలా;
వికృతులన్నిటినీ మూటగట్టి
ప్రకృతి ఒడిలోకి విసిరేస్తూ.

పెరుగుతున్నది ఆ తపస్సు
శిరసుమీది పుట్టలను ఛేదించుకుంటూ
స్థిరసంకల్పం నాదంగా ప్రబోధించుకుంటూ
నక్షత్రమండలాలను పెళ్ళగించుకుంటూ
అక్షీణ కాంతిగోళాలను
ఆక్రమించుకుంటూ
అనాహతంగా అశరీరంగా ప్రస్థానిస్తూ
పెత్తనం మరిగిన వైభవమత్తుల
ఎత్తుగద్దెను ప్రతిఘటిస్తూ.

బిత్తరపోయింది పెత్తనం
గుత్తాసొత్తు చేజారినట్టు.
అగమ్యంగా దాచివుంచిన
అమృతభాండం కుదురు కదిలినట్టు
పెరట్లో కట్టేసిన వాహనంమీద
మరెవ్వడో ఊరేగిపోయినట్టు.
తనచుట్టూ అల్లుకున్న ఆనందవని
ధరణిపైకి రాలిపోయినట్టు.
విలవిలలాడింది అధికారం
వెయ్యికళ్ళు మండిపోగా.
చిటికవేసింది అధిశాసనం
త్రుటిలో ఓ మెరుపుతీగ తుళ్ళిరాగా.
నయనహుంకృతి నెరిగిన ఆ మెరుపుతీగ
ఎగిసి వాలింది పుడమిపైకి;

సడలిపోని రూక్షతపోదీక్ష
జడలుగట్టుకున్న మౌనవాటికి.
మెరుపుతీగ ఆగి చూసింది
మెరిసింది జటాటవిలో ఒక విశ్వం;
ఊర్ధ్వలోకాలను అధఃకరించే
ఉగ్ర తపస్సర్వస్వం.
తిరిగిచూసింది ఆ మెరుపుతీగ
పురుషాతపం
పూర్ణచంద్రికల పురులు విప్పగా-
శ్వాస గడ్డకట్టిన
సౌరభఝుంఝులు రెక్కలెత్తగా.
ఆ తీగ చిగురుఅడుగులకు
పువ్వులే మువ్వలై
పరిమళాలే నాదాలై
సకల జీవాణువులు
ముఖరించిపోగా.
మూతపడినచెవికి వేసినముడి
సడలిపోయింది చిత్రంగా.
తలకెగిసిన లోకంటిచూపు
వెలికుబికింది ఆత్రంగా.
శిలలో పోటెత్తింది అల
హిమంలో పొడుచుకొచ్చింది సుమజ్వాల.

చెదిరిన ఉషస్సు కంటికి
చీకట్లే వలల ముంగురులై -
విరిగిన తపస్సు ఒంటికి
మిరుమిట్లే మరుల దొంతరలై -
నియతి చితికిపోగా
నిష్ఠ నీరుకాగా
సంచలించింది సత్త్వశైలం
సమూలంగా.
పడిపోయింది తపశ్శిఖరం
ప్రకామంగా.

ఏళ్ళ తపస్సువేళ్ళను తానే
పెళ్ళగించుకుంటుంది మనసు.
తీవ్ర ఝంఝల పంజాదెబ్బలను
తిప్పికొడుతుంది మనసు.
ఆవిరైన ఆ మనసు ఒకనాడు
ఆశ్రయించింది తరుమూలాన్ని
తృష్ణామూలాన్వేషణలో
దుఃఖహేతుగవేషణలో.
ఇప్పటి ఈ విరాగపథం
అప్పటి అనుభోగపదం.
ఎన్నెన్ని వెన్నెల రేకులతో
ఎదిగిందో ఆ మనసు

ఎన్నెన్ని వసంతాలరెక్కలతో
ఎగిసిందో ఆ మనసు.
అది చూసింది కరిచేమంచును కాదు
పొడియెండలో తడిసేమంచును.
అది చూసింది కటికచీకటిని కాదు
కడకంటితో చిలికే కలికిచీకటిని.
ప్రభాతపదాల అలికిడికి
పక్క దొరలించేది.
పన్నీటికొలని జిలుగుమేనికి
పరిమళాలు పంచేది.
కేళీవనుల సందిళ్ళలో
వాలుసందెలు కరిగించేది.
నురగలెత్తే మదిరల పెదవుల్లో
మరులరుచులు పలికించేది.
కుసుమతల్పాల నౌకలతో
కొసరాత్రులను చుంబించేది.
కత్తిచేతికందితే చాలు
కుత్తుకలు నూరు ఒరిగేవి.
విల్లు ఎక్కుపెట్టితే చాలు
వెయ్యిగుండెలు పగిలేవి.
అశ్వం వెన్నుతట్టితేచాలు
ఆరునిలువులు పొంగిపోయేది.
రథంమీద అడుగుపెట్టితే చాలు
ప్రభంజనం పరుగు వీగిపోయేది.

గళం విప్పితే చాలు
గాంధర్వగంగల శిరసులూగేవి.
తలపు విప్పితే చాలు
లలితకవితలు లాస్యమాడేవి.

కలహాసమే తప్ప
కన్నీరు చూడని మనసు
కోటకొమ్మలే తప్ప
కాటి దిబ్బలెరుగని మనసు
స్వప్నాల పరిధులుదాటి
సాగింది నగరం నడిమికి,
చేదునిజాలు నీడల్లాగా
చెరలాడుతున్న చోటికి.
ఒకదృశ్యం—
సడలిపోయిన కీళ్ళను ఈడ్చుకుంటూ.
మరోదృశ్యం—
కొడిగట్టిన ఊపిరిని ఎగదోసుకుంటూ.
ఇంకో దృశ్యం—
కనుగుడు తేలిన
కట్టెను మోసుకుంటూ.

నిలిచింది తననీడ
నిలువు టద్దంలా.

తోచింది తనరూపం
మట్టిని తొడుక్కున్న మాణిక్యంలా.
పిడుగుపడింది మనసులో.
పేరుకుపోయిన తేనెపొరలు
జారిపడ్డాయి క్షణంలో.
అమ్మలా అల్లుకుపోయింది
అంతశ్చేతన.
బతుకంటే దుఃఖమేనా?
సుఖమంటే స్వప్నమేనా?
కోరిక లేక మనిషి లేడా?
చీకటిలేని వెలుగు రాదా?
మస్తిష్కాన్ని ప్రశ్నిస్తున్న
మంటల మధ్య
కళ్ళలో హోరెత్తుతున్న
కారు చీకట్ల మధ్య
గుండెలో మూల్గుతున్న
ఎండుటాకుల మధ్య
అడుగులు కదులుతున్నాయి
అడుగడుగునా చుట్టుకుంటున్న
రాగరజ్జువులు తెంచుకుని
రక్తబంధాలు తప్పించుకుని.
అడుగులే ప్రశ్నలై
అడుగుతున్నాయి

జడలుకట్టిన అరణ్యాలను
జ్ఞానపీఠికలను
ధ్యానవాటికలను.

బదులు దొరకని అడుగులు
కుదురుకున్నాయి తరుమూలంలో;
సృష్టిరహస్య శోధనలో
జీవితలక్ష్య సాధనలో.

అటు నవ్విందొక అందె
ఇటు నవ్విందొక మలిసందె.
అటు పలికిందొక కుసుమశలాక
ఇటు పలికిందొక మదనపతాక.

చిరురవళుల తరంగాలు-
చెవి విప్పలేదు తరువు.

హొయలు చూపుల దుమారాలు-
నయనాలు విప్పలేదు తరువు.

సౌరభాల కల్లోలాలు-
చలించలేదు తరువు.

ప్రలోభాల ప్రకంపనలు-
పట్టు తప్పలేదు తరువు.

తరుమూలంలో ఉన్న మనసే
తన శిరసు చుట్టూ వెలిగింది.

జీవిని కమ్ముకున్న మంచు పొగ
ఆ వెలుగులో కరిగింది.

కాంక్ష మనసుకు వేరు
కదలిక దాని తీరు.
కాంక్ష పెరిగితే ఆశ
ఆశ ముదిరితే లోభం.
లోభానికి ఎన్నెన్ని పొరలు
లోతు లెరుగని పాతరలు.
తన చూపుడు వేలు నీడలో
ధరాగోళం ఒదగాలని
తన కత్తుల తళతళలు
ఇనకాంతులై కదలాలని
తన ముంగిట్లో ధనరాసులన్నీ
తలలు వాల్చి నిలవాలని
తన గుప్పిట్లో మారణశక్తులన్నీ
దాసోహ మనాలని.

తరలి పోయిందొకనాడు
తల తిరిగిన లోభం
అహంకార దాహం
ధ్వజమెత్తి రాగా

ఆక్రమణ మోహం కరళ్ళెత్తిపోగా.
యవనాశ్వాల వికటహేషల్లో
అవిసిపోతున్న అష్టదిక్కులు.
కదనుతొక్కే ఉక్కుకాళ్ళకింద
కమిలిపోతున్న అసువుల మొక్కలు.
పొగరు కత్తుల పాశవికక్రీడలో
ఎగిరిపడుతున్న శిరస్సులు.
కురిసిన నరరక్తం స్పర్శతో
ఎరుపెక్కిన సరస్సులు.
ఏ పశుత్వం కొమ్ము విసిరిందని
ఈ విలయవిహారం.
ఏ అధర్మం కాలుదువ్విందని
ఈ భయదసంహారం.
ఇళ్ళనూ
పండి ఒరిగిన పైరుమళ్ళనూ
నిప్పుల ఉప్పెనలో
ఎందుకు నిలువునా ముంచెత్తినట్టు?
ప్రాణాలనూ
ప్రాణాధికంగా దాచుకునే మానాలనూ
రక్కసిగోళ్ళతో ఎందుకు
రక్కుకు పోతున్నట్టు?

విజేతగా వెలగాలంటే
విశ్వాన్నే భస్మం చేయాలా?
ధరాలోభం తీరాలంటే
నరరుధిరమే కావాలా?
వేయితోటలను నరికినచేయి
పూయిస్తుందా ఒక్క పువ్వును?
మారణహుంకృతులు మరిగిన నోరు
చేరబిలుస్తుందా ఒక్క శిశువును?
తనచూపే శాసనసూక్తంగా
తన చిటికే భేరీధ్వానంగా
మోపిన తన ప్రతి అడుగూ
నాటని విజయస్తంభంగా
సాగిపోయింది ఆ లోభం
సాగరాలను చుట్టేసుకుంటూ.
పిడికిలెత్తింది ఆ లోభం
పృథ్వీతలాన్ని వశీకరించుకుంటూ.
బిగించిన ఆ పిడికిలిలో ఏముందో?
జగత్తు జాతకం ఒదిగుందా!
విశ్రమించిన ఆ మూర్తిలో ఏముందో?
విశ్వ విజేతృముద్ర కొలువుందా!
ప్రశ్నల్లా మెరిసిపోతున్న కళ్లకు
పాపం! తెలియదు—
పట్టిన ఆ పిడికిలి
కడవూపిరి విడిచిందని

పతాక ఊడిపోయి
వట్టికర్ర మిగిలిందని.
విజ్ఞతచూపు సోకగానే
విచ్చుకున్న ఆ పిడికిట్లో
ఆవులించింది దైన్యం
అహంకృతికి సమాధికట్టిన శూన్యం.

కాసేపు శూన్యంలా వేలాడి
చొరబడింది ఆ లోభం
మరో రాజ్యదాహంలోకి.
ప్రతి కాహళ తన శౌర్యం పలకాలని
ప్రతి పతాక తనపేరిట నిలవాలని
ప్రతి మకుటం తనకాలిగోటిలో
ప్రతిఫలించాలని
ప్రతిహృదయం తన విచ్చుకత్తికి
ప్రణమిల్లాలని.
అది తెంచివేసింది ఆత్మీయతను
చిదిమివేసింది ఆప్యాయతను.
పాలుపోసి పెంచుకున్నది క్రౌర్యాన్ని
పచ్చినెత్తురుతో అభిషేకించింది పారుష్యాన్ని.
అది జరిపిన జైత్రయాత్రలో
అంతటా శవాల కుప్పలే.

హింసోల్బణంలో కమిరిపోయిన
మాంసఖండాల దిబ్బలే.
రణోన్మాదం ముదిరిన ఖడ్గం
హననతృష్ణ తీరని కంఠం
ఉక్కునాల్కలు సాచుకుంటూ
ఉగ్రతను పుక్కిలించుకుంటూ
గాలిలో మూల్గుతున్న గర్భశోకాన్ని
కహకహ ధ్వనులతో పడదొక్కుకుంటూ
నడుస్తున్నాయి విచ్చలవిడిగా
సుడులు తిరిగే వల్లకాటి పొగలా.
పారిపోతున్నాయి పల్లెలు
నీరౌతున్నాయి నగరాలు
ఒక్క పూరిగుడిసె తప్ప
ఒక్క బడుగు ముసలిజంట తప్ప.

'ముంగిట్లో నిలిచిన అధినేతను
మూడు దిక్కులు గెలిచిన విజేతను.
నిలువరేమి మీ తలలు వంచి
కొలువరేమి గుండెలు సమర్పించి?'
'నరోత్తములకే అందుతాయి నమస్సులు
దురాత్ములకు కాదు.
కారుణ్యానికే వంగుతాయి శిరస్సులు
కాఠిన్యానికి కాదు.'

పలికింది పురుషస్వరం
పరమశాంతం పల్లవించగా.
ఉరిమింది నగ్నఖడ్గం
ఉదగ్రమదం ప్రజ్వలించగా.
ఒరిగిపోయింది ఆ శాంతస్వరం
ఉబికి పారింది అనాథగళం-
'ఇది నీ తుదివిజయం
ఇంక ఏలుకో శ్మశానాలను.
ఎదురులేనిది నీ విభవం
ఇంక పిల్చుకో విషపవనాలను.
లక్షప్రాణాలను ఆర్పేసిన కత్తి
ఒక్క ఊపిరిని వెలిగిస్తుందా?
ఉర్వీతలాన్ని వణికించిన శక్తి
ఒక్క హృదయాన్ని జయిస్తుందా?
వింటావా నీ కీర్తి గానం
గుంటనక్కల గుంపునోట.
కుళ్ళిన శవాలను పీక్కుతినే
బొల్లి గద్దలున్న చోట.'
చెదిరిపోయింది దర్పం
చేయిజారింది ఖడ్గం.
కదిలిపోయింది పునాదులతో
కట్టుకున్న అహంకార దుర్గం.
'ఏమిటి? సాధించిందేమిటి?

నరరుధిరంతో
ఎరుపెక్కిన చీకటి.
ఈ చీకటి వెలుగౌతుందా?
ఈ హింస గెలుపౌతుందా?
మగతను నూరిపోసే లోభం
మనసుకు మేలుకొలుపౌతుందా?
మస్తకలను నరికితే కాదు
గుండెలను కలిపితే గెలుపు.
వినాశం జరిగితే కాదు
వివేకం పెరిగితే గెలుపు.
సమరం రగిలించేది భీతి
సహనం వర్షించేది ప్రీతి
అనురాగం చేసే శాసనమే
అసలైన రాజనీతి.'
సమరాన్ని నిరసించిన సమ్రాట్టు
శాంతి శిఖరానికి అడుగుమెట్టు.
పరిపాలనకు చేసిన వ్యాఖ్యానం
పరమధర్మం జరిపిన ప్రస్థానం.
ప్రజాహితమే అభిమతంగా
దయాగుణమే ప్రియరుతంగా
ఎల్లలు దాటింది
ఆ ధర్మపథం
చల్లగా సాగింది
ఆ మనోరథం.

అరుణోదయం ఊరుకోదు
కిరణాలను సారించనిదే.
వసంతోదయం ఊరుకోదు
పరిమళాలను పారించనిదే.
ప్రసరించే నీరు ఊరుకోదు
పల్లం అంతుముట్టనిదే.
ప్రతిఘటించే మనసు ఊరుకోదు
ప్రశ్నలను ఎక్కుపెట్టనిదే.
ఎన్నెన్నో ప్రశ్నలకు
వెన్నెముకలాంటి ప్రశ్న
అజ్ఞతనూ మదమగ్నతనూ
అద్దంపట్టి చూపిన ప్రశ్న
కూచున్నది కటకటాలమధ్య కొండలా
వీచే నిట్టూర్పులమధ్య చలించని గుండెలా.
ప్రశ్నచేతిలోని విషపాత్రిక
పలుకరిస్తున్నది జాలిగా
ప్రాణహరణ గుణాన్ని దిగమింగుకుంటూ
పరమోజ్జ్వల సత్యానికి పడుతున్న గ్రహణానికి
పరితపించుకుంటూ.

'తెలుసా నువ్వుచేసిన నేరం?
తెరిచావుకదూ జ్ఞానద్వారం.
ఏమిటో చెప్పనా నీ నైజం?
ఎగరేశావుకదూ సత్యధ్వజం.
నిరసించావెందుకని
తరతరాలుగా పాతుకున్న దైవగణాలను.
రగిలించావెందుకని
పొగలపొరలు దాటని యువాగ్నికణాలను.
నీ నుదుటనే పొడిచిందా న్యాయం?
నీ కుదుటనే మొలిచిందా ధర్మం?
నిలదీసి అడిగావెందుకు
తలబిగిసిన విశ్రుతవిద్వత్తును.
పెళ్ళగించి వేశావెందుకు
వేళ్ళుదిగిన అహంకారాలమత్తును.
సౌశీల్యమే జ్ఞానమని
సౌందర్యమే సత్యమని
ఆత్మతత్త్వం హేతురీతిలో
అనువదించా వెందుకు?
చట్రంకట్టిన సంఘపటాన్ని
పట్టి ఊపావెందుకు?'

పలికింది విషపాత్రిక కాదు
పలకబారిన అధికారం నాలుక

వింటున్నది చెరసాల కాదు
విచలించని వివేక దీపిక.
ప్రశ్నను బంధిస్తే ఉదయిస్తాయి
ప్రవచనాలు.
గాలిని బంధిస్తే ఉబికివస్తాయి
కల్లోలాలు.
'నాకు తెలిసిందొక్కటే
నాకేమీ తెలియదని.
విత్తు నాటకుండానే
వృక్షం మొలవదని.
చెడూ మంచీ తెలిస్తేనే
చెడుకు మనసు లొంగదని.
అడుసు ఉనికి తెలిస్తేనే
అడుగు నేలపై పడుతుందని.
చదును చేసిన మనసులోనే
పదునెక్కుతుంది జిజ్ఞాస.
మునిమాపులో ఏనాడూ
కనిపించదు ప్రత్యూష.
ఆత్మాహుతిలోనే సత్యం
అమృతంగా నిలుస్తుంది.
తాను జ్వలిస్తేనే దీపం
తనచుట్టూ వెలుగిస్తుంది.
ఆలోచనల పొద్దుపొడుపును
ఆపలేవు ఏ చీకట్లు.

వెలిజిమ్మే ఆత్మకిరణాలను
నిలువలేవు ఏ గొలుసుకట్లు.'
మనసు పొగిలిన విషచషకం
తొణికింది వేడికన్నీరులా
తెగిపోతున్న స్వరాన్ని ముడివేసుకుంటూ
ఆగిపోతున్న శ్వాసల్ని సాగదీసుకుంటూ.
'సత్యానికి మృత్యువా?
న్యాయానికి నాశనమా?
నీతికి ఖననమా?
నియతికి దహనమా?'
తనువేమైనా ఆత్మ నశించదు
కనుమరుగైనా కాంతి నశించదు.
మరణం లేదు ప్రశ్నకు
పరిధి లేదు జ్ఞానతృష్ణకు.'

సృష్టికి మూలం
జ్ఞానబీజం.
విశ్వంభరాభ్రమణానికి మూలం
శాశ్వతచైతన్య తేజం.
పక్షులరెక్కలు ముడుచుకు పడుకున్నా
పశువులడెక్కలు గురకలు పెడుతున్నా
పుట్టల్లో పూత్కారాలు
మూగవడి ఉన్నా

జుట్లు విరబోసుకున్న చెట్లు
జోగుతూ ఉన్నా
నిద్రించదు జ్ఞానం
నీరసించదు తేజం.
ఇలాగర్భం తవ్వేసుకుంది తననుతాను
ఎన్నోకోట్ల పొరలుగా.
ఇతిహాసం తిరగేసుకుంది తనను తాను
ఎన్నోలక్షల పుటలుగా.
విదిలించిన పొరలన్నిటిలో
విచ్చుకున్న పుటలన్నిటిలో
నిత్యంజరిగిన సూర్యహత్య లెన్నని?
నిరంతరం వేసిన జ్ఞానశిక్ష లెన్నని?
రాళ్ళు విసిరే చీకటిమూకలమధ్య
రక్కసితనం పెంచుకున్న ఉక్కుకాకుల మధ్య
ప్రశాంతంగా పలికిన కిరణాలవి.
పాపపుణ్యాలు నిర్ణయించేదెవరని?
ఉందా పాపచింతనలేని శిరస్సు?
ఉందా అన్యవంచనలేని మనస్సు?
ఆత్మశోధన గీటురాయి శీలానికి
ఆర్ద్రనివేదన ఆకురాయి హృదయానికి.
తమస్సులా కమ్ముకొస్తే
తప్పదు మూలచ్ఛేదం.
ప్రభాతంలా కళ్ళు తెరిస్తే
ప్రసరిస్తుంది జీవనాదం.

చీకటికి ఒళ్ళు మండుతుంది
'చీకటీ' అని పిలిస్తే.
అజ్ఞానం ఉరిమిపడుతుంది
'అజ్ఞానమ'ని నిలదీస్తే.

సహస్రకిరణ ముఖాలతో
సత్యాన్ని ప్రబోధించే కాంతిని
పడమటి కొయ్యకు బంధించి
పదునుచీకట్ల మేకులు దించి
నల్లనల్లగా నవ్వింది అజ్ఞానం
పెల్లుబికే మదంతో మతిభ్రమించి.
అల్లాడిపోలేదు కాంతి
ఆక్రందించలేదు కాంతి.
కురిసింది పచ్చినెత్తుటిబొట్లు
కరుణకు రూపాంతరంలా.
నెత్తిమీద ముళ్ళకిరీటంతో
నిలువెల్లా నాటిన మేకులతో
చల్లగా చూసింది ఆ కాంతి
సహనమెత్తిన అవతారంలా.
ఆ కాంతి ఇంకిపోలేదు మట్టిపొరల్లో
ఆ గొంతు మూగవోలేదు చీకటిరొదల్లో.
అది పొందింది పునరుత్థానం.
అరుణోదయం అంకురిస్తున్న కుదుళ్ళలో.

ఆ వాణి స్పర్శించింది
ఆర్తుల గుండెలను అభయహస్తంలా.
ఆ వాణి చల్లార్చింది
దావాగ్నిలాంటి ద్వేషాన్ని అమృతవర్షంలా.
అది నిలిచింది పందిరిలా
వర్ణాహంకారాల వడదెబ్బలమధ్య.
అది నిలిచింది మందిరంలా
అజ్ఞాన తిమిరాల పెడబొబ్బలమధ్య.
విత్తనాన్ని మట్టిలోకి విసిరికొడితే
వృక్షమై పేలుతుంది.
ఒక్కనోటిని నొక్కేయాలని చూస్తే
లక్షకంఠాలై మోగుతుంది.
అది ప్రచండ మౌనఘోష
ఆర్ద్రహృదయం దాని క్షేత్రం.
అది సాగిపోతుంది నిరంతరం
ఆత్మస్థైర్యం దాని సూత్రం.
పులుముకున్న ఆకాశంచీకట్లలో
వెలుగుతుంది మెరుగుచుక్కలా.
పేరుకున్న ఎడారిదిబ్బల్లో
పెరుగుతుంది గరికమొక్కలా.
కారడవుల జీబురుపొదల్లో
కదులుతుంది పదముద్రికలా.
హోరెత్తే కోరలసెగల్లో
ఉంటుంది ఆశ్రమవాటికలా.

దారితప్పిన పసివాడికి
తల్లి ఒడిలాంటిది.
వడగాలి ఉమిసేనోటికి
పొలజడి లాంటిది.
ఆ తేజం విశ్వచరితకు
అభినవ భూమిక.
ఆ జ్ఞానం నవ్యమానవతకు
అఖండ దీపిక.

# 4

ఎన్నెన్ని ప్రస్థానాలు మనిషికి?
ఎన్నెన్ని పరిభ్రమణాలు మనిషికి?
అంతలోనే నురగల వరుగు.
అంతలోనే కదలని అడుగు.
ఎవరు తాను?
ఏ ధాతుగర్భంనుంచి ఎదిగిన మాను?
ఎలా కుదించుకున్నాయో
ఇంత మొలకలో అంతటి శాఖలు?
ఎలా పొదుగుకున్నాయో
ఇంత విత్తులో అంతటి జీవరేఖలు?
తరువులా పెరిగిన మనిషి
తిరిగి చూసుకుంటాడు తనను తాను.
ముసురుకొస్తాయి హరితస్మృతులు
మొక్కపొత్తిళ్ళ నుంచి
కొమ్మలపందిళ్ళ దాకా.
అమ్మ ఒడినే అనంతవిశ్వమనుకుని
స్తన్యంలోనే సమస్త మధురిమలందుకుని
బురదను పిసికి
బుగ్గలకు పూసుకుని
ఆకాశంలోని జాబిల్లిని

అద్దంలోకి దింపుకుని
కొయ్యగుర్రమెక్కి-
కోటి ఆమడలు తిరగేసి
కట్టెపుల్లలు పట్టి
కత్తిసాములు చేసి
బాల్యకుల్యలీదిన మనిషి
పలవరించాడు తనలోతాను మెరిసి.

అగుపించిన సొగసులన్నీ
మగువగా మలచుకుని
అల్లుకున్న స్వప్నాలన్నీ
ఆకృతులుగా నిలుపుకుని
తాకిన పూలరేకులన్నీ
తరుణి పెదవులనుకుని
సోకిన గాలితరగలన్నీ
సురభిళ శ్వాసలనుకుని
తరలిపోయే కాలాన్ని
పరిష్వంగంలో పొదుగుకుని
పరవశించిన ప్రతిక్షణాన్ని
సురానుభూతిగా దాచుకుని
యవ్వనగగనాలంటిన మనిషి
నవ్వుకున్నాడు తనలోతాను ఎగిసి.

కట్టుకున్న వెన్నెలగూటిలో
కాపురం పెట్టి
పెంచుకున్న మమకారాల
అంచులు ముట్టి
ఆశించిన సంపదల
అందలాలపై ఊరేగి
కోరుకున్న అనుభవాలను
కుత్తుకబంటిగా తాగి
గీసిన గీటు చెల్లుతూ ఉంటే
మీసాలపై చేయిసాగి
వేసిన పాచిక పారుతూ ఉంటే
వెండిజుత్తు మెత్తగా ఊగి
ముదిమిని తొడుక్కున్న మనిషి
ముచ్చటించుకున్నాడు తనలోతాను తరచి.

ఎందాక ఈ నడక?
ఈ అడుగు సాగినందాక.

ఎన్నాళ్ళు సాగుతుందీ అడుగు?
ఎదురుగా లోయనిలిచేదాక.
ఏమంటుంది ఆ లోయ?
ఈడ్చుకుంటుంది అగాధందాక.
ఏమౌతుంది ఆపైన?
ఇది ప్రశ్నగా మిగిలిన ప్రశ్న.

ఎంత బాగా మెరుగుపెట్టాను
ఈ పసిడిపంజరానికి?
ఎన్ని ముత్యాలగింజలను తినిపించాను
ఈ ప్రాణవిహంగానికి?
ఇది ఒరిగిపోతుందా లోయలోకి?
అది ఎగిరిపోతుందా శూన్యంలోకి?
మళ్ళీ ప్రసవిస్తుందా శూన్యం
మరోజన్మకు తీగలా పాకి.
మృతికి పరిష్కృతి శూన్యమా?
శూన్యానికి ఆవిష్కృతి జననమా?
ఎన్ని నదీజలాలు కలిసినా
ఏ వికృతీలేదు సముద్రానికి.
ఎన్నిచోట్ల పదం మోపినా
ఏ కశ్మలమంటదు ఇనకిరణానికి.
పంజరంలోని వాసనలు
పక్షికెందుకంటవు?
ఆకృతిలోని వికారాలు
ఆత్మకెందుకంటవు?

అగుపించనిది నిత్యమా?
అగుపించేది మర్త్యమా?
ఎవరు చేసిన సృష్టి ఇది?
చివరికి మృత్యువే సత్యమా?
నిరంతర జీవయాత్ర
మరణానికి నేపథ్యమా?
ఆకులు రాలక తప్పదంటే
అంకురదశ ఎందుకో?
మరణం రాక తప్పదంటే
శరీరధారణ మెందుకో?
చిల్లులవడ్డ కుండలో
నీళ్ళు తేవడమెందుకు?
చివికిపోయే గూటిలో
జీవి దాగడమెందుకు?
ఏ కత్తితో చీల్చలేనిది
ఏ నిప్పుతో కాల్చలేనిది
ఊదితే ఎగిరే బూదికుప్పలో
ఒదిగి ఒదిగి ఉండడమెందుకు?
జననం లేనిదే స్థితి ఉంటుందా?
గమనం లేనిదే గతి ఉంటుందా?
పంచభూతాల ప్రస్తారాలకు
మించిన ప్రకృతి ఉంటుందా?
ఏ రూపమూ లేనిదానికి
ఇన్ని విడివిడి తొడుగులెందుకు?

అంతటా నిండి ఉన్నదానికి
అరలు అరలుగా విడుదులెందుకు?
అగ్నిలాంటిది లోన ఉంటే
అంటుతుందా ఒంటికి చెదలు?
అమృతతత్వం పైన ఉంటే
అవనికుంటుందా చావుదిగులు?

దేహం ఒక బొంగరం
దీన్ని తిప్పేది ఊపిరి.
ఎప్పుడాగిపోతుందో అది
చెప్పేది ఎవరని?
దేహాన్ని తిప్పలేని ప్రాణి
సోహం అనడం దేనికని?
తెరఅవతల చూడలేని మనిషి
పరతత్వం ప్రవచిస్తాడెందుకని?
అజ్ఞతను కప్పిపుచ్చే
ఆచ్ఛాదనలా ఇవి?
అశక్తతను మరుగుపరిచే
అభినర్తనలా ఇవి?
అల్లుకున్న సాలెగూళ్ళు
అవుతాయా సౌధాలు?
అలలెత్తే ఎండమావులు
అవుతాయా సాగరాలు?

ఒంటబట్టిన దేహప్రీతికి
అంతుపట్టని ప్రాణభీతికి
ఆశ్రయమిచ్చిన దివ్యకల్పన
అతిలోకశకుల ఆరాధన.

కొరడాకొసలు ఛెళ్ళుమన్నట్టు
కోడెతాచులు బుస్సుమన్నట్టు
ఉలిక్కిపడ్డాడు మనిషి
ఊహాస్తంభం విరిగిపడినట్టు
పరుచుకున్న చాపమీద తానులేడు
తిరుగుతున్న బంతిమీద పరుగిడుతున్నాడు.
ఏ అదృశ్యహస్తం విసిరిన కందుకమది?
ఎప్పుడో విముక్తమైన ఇనఖండిక అది.
ఏ కుదురూలేని గ్రహతారకలు
ఎలా మిగిలి ఉన్నాయి?
కనిపించని అంతస్సూత్రాలలో
కట్టువడి ఉన్నాయి.
పొరలు పొరలుగా తవ్వుకుంటూ
పురోగమించింది జిజ్ఞాస.
ఎన్నెన్ని సత్యాలను ఆస్వాదిస్తున్నా
ఇంకా తీరని పిపాస.

ఎగిరే పక్షులను చూస్తూ
ఏళ్ళతరబడి నిట్టూర్చిన తాను
ఎగిసిపోతున్నాడు గగనవాటికి
ఏ రెక్కా చొరలేని గూటికి.
ఏటిని దాటిపోవాలంటే
మాటిమాటికీ జడుసుకునేవాడు
కడలి కెరటాల లోగిళ్ళను
పడకగదులుగా తీర్చుకున్నాడు.
గాలికోని పరుగును హరించి
కదిలే చక్రాలకు అంటించి
కాలుమీద కాలువేసుకుని
లీలగా పయనిస్తున్నాడు.
ఎక్కడో చిగురించిన ధ్వనిని
ఎన్నెన్నో తీగలుగా పారించి
శ్రవణాల పందిళ్ళలోన
సౌరభాలు నింపుతున్నాడు.
తెరవెనుక బొమ్మలాడిస్తూ
దరువులు వేసుకున్న తాను
పలికే మనుషులను తెరమీద
వెలుగునీడలుగా ఆడిస్తున్నాడు.
దూరాన్ని దృశ్యంగా మార్చి
దృశ్యానికి నాదం కూర్చి

కంటిఇంటిలోకి చేర్చి
కాపురం చేయిస్తున్నాడు.
క్షణంలో వెలిగిఆరే మెరుపుల్ని
తన ముంగిట్లో పునస్సృష్టి చేసి
చైతన్యశక్తిగా రాశిపోసి
చాకిరీ చేయిస్తున్నాడు.
కంటిచూపు అందుకోలేని
ఒంటిలోని పొరలలోతుల్ని
కిరణాలే చిత్రనయనాలుగా
పరికించి చూస్తున్నాడు.
మరనే మతిగా మలచి
మనిషికి ప్రతిగా నిలిపి
ఆలోచనలకే సరికొత్త
ఆకృతులు గీస్తున్నాడు.
అవనిపై ఉంటూనే కళ్ళను
అంతరిక్షంలోకి పంపించి
నక్షత్రాల నాడుల జాడలు
వీక్షిస్తూ ఉన్నాడు.
అగుపించని జీవాణువుల
అసలురూపు బయటపెట్టి
చూపులకు ఊహించలేని
సూక్ష్మత కలిగిస్తున్నాడు.
మృత్యువుకూ వ్యాధికీ ఉన్న
పొత్తును విచ్ఛేదించి

ఆ రెంటికీ మధ్య మరింతగా
అఖాతం పెంచుతున్నాడు.
గాలిగూటిలో గళపేటిలో
మూలిగే అక్షరనిధులను
ప్రత్యక్ష నిక్షేపాలుగా
వదిలపరుచుకున్నాడు.
పిచ్చిగా ఉరకలెత్తేనదులను
మచ్చికచేసి పెరట్లో కట్టేసి
పైరుపాపలకు పాలిచ్చే
పాడియావులుగా మలచుకున్నాడు.
అగోచరంగా పడిఉన్న
అణుగర్భంలో పొదిగి ఉన్న
విశ్వతత్త్వాన్ని గుప్పిట్లోబిగించి
అశ్వక్రీడ లాడుకున్నాడు.

మనిషితలలో అట్టహాసం
మహోదధిలా ఉరిమింది.
ఆరడుగులమేను మిన్నంటి
అహంకృతిలా మెరిసింది.
తనపాదం కరచుకున్నది మట్టిని
తనమూర్ధం కుమ్ముతున్నది మింటిని.
పంచభూతాలున్నాయి తనచుట్టూ
పడిగాపులు కాస్తున్నట్టు.

గగనంలా విస్తరించిన శిరస్సులోన
గ్రహతారకల బృందస్వరాలు.
యుగయుగాల శూన్యఫలకాలపైన
ఎగిసివస్తున్న స్మృతివలయాలు.
ఒక పరిచితకంఠం
హుంకరించిన శాసనంలా.
ధిక్కరించిన మరోస్వరం
డీకొన్న ఉద్రేకంలా.
అవేమాటలు
అక్షరాలా అవేమాటలు
అప్పుడెప్పుడో తానాడిన చెలగాటలు.
'అయితే వెళ్ళిపో మట్టిమనిషీ
ఆ మట్టిలోకి'
'అలాగే
వెళ్ళి పొంగిస్తాను ఆ మట్టిని
నింగిపైకి'
'అందాకా వచ్చిందా నీ అహంకృతి?'
'అక్కడే మొదలవుతుంది
మానవ సంస్కృతి.'

తానిప్పుడు గాలిబుడగకాదు
ఏ దారం చేతిలోనో ఎగిరే
తోలుపడగ కాదు.

తనకన్ను పలికితేనే ఉదయం
తనమనసు మలిగితేనే అస్తమయం.
తానే ఒక చైతన్య వారిధి
తానే దానికి కట్టిన వారధి.
తన జ్ఞానం సృష్టిసమస్యాపూరణం.
తన ధ్యానం మూలరహస్యప్రేరణం.
తనకు తెలుసు
తాను పెంచుకున్న మువ్వన్నెల చిలకను
తన్నుకుపోవడానికి
అహరహం ముక్కులు నూరుతున్న
ఆరు గద్దలున్నాయని.
తనకు తెలుసు
తాను ఆఘ్రాణిస్తున్న ఐదురేకుల పువ్వును
ఎగరకొట్టడానికి
అనుక్షణం కాలప్రభంజనం
అంగలారుస్తున్నదని.
కలికితీపి
కలిమితీపి
కడుపుతీపి
కలిసి ఆడే నిరంతర నాటకంలో
తాను వేసే నాయకపాత్రకు
కడకు మిగిలేవి
సుడిగుండాలని.

అణువులోని అవ్యక్తమూర్తిని
అజాండంగా చూసిన తాను
గ్రహాలలో సుప్తంగా పడిఉన్న
గాలి ఉనికిని తూచిన తాను
చూసుకున్నాడా తనలోని రూపం?
తెలుసుకున్నాడా తన మనసుతూకం
ఏ అడుగో తన పక్కను తాకితే
ఎంత విషం కక్కుతాడు?
ఏ చెయ్యో తన జుట్టును తగిలితే
ఎన్ని పొగలు చిమ్ముతాడు?
తన చేనిగట్టు కాస్తా తరిగితే
తలకాయలు పగులుతాయి.
తన ఆటపట్టు కాస్తా చెదిరితే
అనుబంధాలు తెగుతాయి.
ఉషస్సులో తాను గీసిన చిత్రాలు
మసకసందెలో మసిబారుతున్నాయి.
విడిగా తాను చెక్కిన స్వప్నశిల్పాలు
నడివీధి తొక్కిడిలో ముక్కలౌతున్నాయి.
మౌనంలా మీటుకున్న స్వరసంపుటాలు
మహార్ణవం ఘోషల్లో మునిగిపోతున్నాయి.
పయనంలో పిలుస్తున్న మైలురాళ్ళు
పాదాలకు ప్రశ్నార్థకాలౌతున్నాయి.

ఎక్కిన శిఖరాలే అవి
ఇప్పుడు మూల్గుతున్నాయి లోయల్లా.
ఎగిసిన గగనాలే అవి
ఇప్పుడు ముడుచుకున్నాయి
ఇరుకుగదుల్లా.
వేసిన పొలికేకలే అవి
వినిపిస్తున్నాయి పిచ్చుకగొంతుకల్లా.
పైకెత్తిన కాగడాలే అవి
పడిఉన్నాయి చచ్చుమిణుగురుల్లా.
కంఠాన్ని ముద్దాడిన విరిదండలు
కరిచేస్తున్నాయేమిటి?
కీర్తి చుట్టూ పారాడిన దండకాలు
కీళ్ళను తొలుస్తున్నాయేమిటి?
తన పంచలో పెరుగుతున్న పిల్లకుక్క
తనమీదికి ఉరికొస్తున్నదేమిటి?
పచ్చగా పెంచుకున్న మల్లెమొక్క
పిచ్చిపూలు పుక్కిలిస్తున్నదేమిటి?
తానుఒత్తిగిల్లే మెత్తని పాన్పు
తననే ఎత్తిపారేస్తున్నదేమిటి?
తాను పేర్చిన అక్షరాలకూర్పు
తననే తప్పుపడుతున్నదేమిటి?

ఇది తానెక్కిన పీఠమే —
ఎవరినో మోస్తున్నదేమిటి ?
ఇది తాను నేర్పిన పాఠమే —
ఎవరినో వల్లిస్తున్నదేమిటి ?
ఏమయింది తన చేతిలోని దండం
ఏ మాంత్రికుడు మచ్చిక చేసుకున్నాడు ?
ఏమయింది తన ఆజ్ఞాపత్రం
ఏ అర్భకుడు గాలిపటంగా చేసుకున్నాడు?

'నా నీడ నన్నే వెక్కిరిస్తున్నది
నా శవం నావైపే నడిచివస్తున్నది.
గొంతుకలో నేను సవరించిన స్వరం
గుడ్లగూబగా ఎదురొస్తున్నది.
ఇది నేను కట్టుకున్న కోట
ఎలా పొడుచుకొస్తున్నాయి గుడిసెలు ?
ప్రహరీగోడ ఏమైనట్టు
పారిపోయిందా కట్టుబట్టలతో ?
కంచె ఎక్కడ చచ్చినట్టు
కలిపిందా చేతులు చితిమంటలతో ?
అడుగుమోపిన చోటల్లా
అడుసు చిమ్ముకొస్తున్నది.
గాలి పీల్చినపుడల్లా
కమురుకంపు కొడుతున్నది.

ఏం చేసుకోను ఈ వెండికంచం?
ఏవేవో క్రిములు కదులుతున్నాయి.
ఎలా పట్టుకోను ఈ మధుచషకం?
ఏ వికటస్మృతులో తొణుకుతున్నాయి.
తెగిపోతున్న ఊపిరిని
సగం సగం గతుకుతున్నాను.

బుర్రలో బద్దలౌతున్న తేళ్ళపొట్టలు.
వెర్రిగా కొట్టుకుంటున్న గుండె.
వేళ్ళలో ఇరుక్కున్న జుట్టు.
కాళ్ళను లాగుతున్న ఊబి.
తలను చీల్చేసే అరుపు
అలలు అలలుగా.
అలల నురగలమీద
అచ్చవుతున్న అక్షరాలు
అవ్యక్తాన్ని ప్రశ్నిస్తున్న ఆకృతుల్లాగా.
దృష్టికందని సృష్టి ఉందేమో?
సృష్టికందని దృష్టి ఉందేమో?
వాక్కుకందని అర్థముందేమో?
మనసుకందని భావముందేమో?
వ్యక్తిని ఆవరించే శక్తి ఉందేమో?
శూన్యాన్ని చిత్రించే చైతన్యముందేమో?

ఉన్నట్టే ఉంది—
ఊగింది శిరసు పరవశించి.
ఉన్నట్టే ఉంది—
మోగింది శరీరం పరిస్పందించి.

అరమూసిన కళ్ళలో ఆవిర్భవిస్తున్నాయి
చిరునవ్వులు చెక్కుకున్న ముఖాలు
వరాలు కురిపిస్తున్న నేత్రాలు
వెరపును జడిపిస్తున్న హస్తాలు
ముక్తికి మూర్తికట్టిన పాదాలు.
రాళ్ళు పాతుకుంటున్నాయి
రకరకాల ఆకారాలతో.
కొయ్యలు కుదురుకుంటున్నాయి
కొత్త కొత్త రూపాలతో.
దిక్కులు మొక్కులందుకున్నాయి
దివ్వెలు వినతులందుకున్నాయి
అర్చనలందుకున్నాయి అస్థికలు
ఆలయాలు కట్టుకున్నాయి కేశఖండికలు.
కళ్ళకద్దుకున్నాడు తానుతొక్కినమట్టిని.
తలపై చల్లుకున్నాడు
తనకాళ్ళు నిలిచిన నీటిని.
చేతులెత్తి మొక్కుకున్నాడు
చెకుముకిరాయి చిమ్మిన నిప్పును.

తన బతుక్కి ముడివేసుకున్నాడు
తారాచంద్రాదుల గతులను.
అలంకరించుకున్నాడు మెడలో
అభయ చిహ్నాలను.
అద్దుకున్నాడు నుదుటిపై
ఆత్మీయ విశ్వాసాలను.
పైమెట్టు ఎక్కిపోవాలన్నా
పగవాణ్ని తొక్కిపోవాలన్నా
కట్టుకున్న రహస్యాలమూటలు
పట్టుపడకుండా ఉండాలన్నా
వాన రావాలన్నా
వరద పోవాలన్నా
మడి పండాలన్నా
ఒడి నిండాలన్నా
ఆ మనసుకు ఏకైక శరణం
అతిలోకశక్తుల సంస్మరణం.

స్మరణంతోనే ఆగిపోని మనసు
పరిక్రమించింది బహుముఖాలుగా
కనిపించిన ప్రతిచేతికి
తన నమ్మకాల గుళికలందిస్తూ.
ఏముందో ఆ గుళికల్లో
ఏముందో ఆ పలుకుల్లో.

అలలెత్తే జ్వలన్మృతులు
ఆగిపోయి వింటున్నాయి.
కంఠీరవాల శిరసుల్లో
గంగిరెద్దులు ఆడుకున్నాయి.
మంటలుమిసే కంఠాల్లో
మంచుగడ్డలు పేరుకున్నాయి.
ప్రశ్నలు నాటిన పాదుల్లో
ప్రార్థనలు మొలకెత్తుతున్నాయి.
ఆలోచనలు చల్లిన బీజాలను
అర్చనలు మరుగుపరుస్తున్నాయి.
తన కన్ను చూసిందే వెలుగు.
తన కాలు వేసిందే అడుగు.
తాను ధరించిందే సిసలైన పాత్ర
తాను దర్శించిందే అసలు పరమాత్మ.
అదే నిజమైతే అరలెందుకిన్ని?
అఖండాత్మలో పొరలెందుకిన్ని?
కలరూపు ఒక్కటైతే
కలత లెందుకిన్ని?
మూలతత్వం ఒక్కటైతే
ముసుగులెందుకిన్ని?
పరమార్థం ప్రవచించే లక్ష్యం
నరబలులకు దారితీస్తుందా?

మానవతను అనుగమించే ధ్యేయం
మనుషులనే వేరుచేస్తుందా?
ప్రేమసస్యం పండాలంటే
ద్వేషం దుక్కిదున్నాలా?
సమతాజ్యోతి వెలగాలంటే
అహంత నిప్పులు కక్కాలా?
ఇది తేటనీరుకాదు
వట్టి బురదవరద.
ఇది మనోనాదం కాదు
మైకం పెట్టిన రొద.
ఆదర్శాల పారాయణమా ఇది?
అసమర్థుల పలాయనమా ఇది?
ఎన్నెన్ని నమ్మకాల నిచ్చెనలెక్కినా
ఇక్కడే నిలుచున్నాడు మనిషి.
ఎన్నెన్ని విముక్తిపథాలు తొక్కినా
ఇక్కడే ముడిపడి ఉన్నాడు మనిషి.
కొండల్లాగా సమస్యలెదురైతే
గుండెను ముడుపుకట్టితే ఎలా?
ఉల్కల్లాగా ఉపద్రవాలు పైబడితే
ఉలికిపడి చేతులెత్తితే ఎలా?
నేలను సాగుచేసేవాడికి
ధూళి అంటక తప్పుతుందా?
శ్రమనే పణంగా ఒడ్డినవాడికి
చెమట పట్టక తప్పుతుందా?

ఏ రంపం కోత లేకుంటే
ఎలా పుడుతుంది వేణువు?
ఏ ఉలిదెబ్బా పడకుంటే
ఎలా పలుకుతుంది స్థాణువు?

గుహనుంచి మహలుదాకా
నడకనుంచి రోదసీనౌకదాకా
దివిటీలనుంచి విద్యుద్దీపాలదాకా
అమ్ములనుంచి అణ్వస్త్రాలదాకా
ప్రవహించిన సంస్కృతికి మూలహేతువు
మనిషిలో వికసించిన విజ్ఞానధాతువు.
చుక్కలను లెక్కిస్తూకూచుంటే
ముక్కారులు పండేవికావు.
అంతా నుదుట రాసి ఉందంటే
యంత్రాలు నడిచేవికావు.
విధిపరిధిలో చంక్రమిస్తుంటే
వివేకం పెరిగేదికాదు.
సంకల్పం నడుము కట్టకుంటే
చరిత్ర తిరిగేది కాదు.
మనిషి జీవితం
అనుభవాంకితం.
అదికాదు గాలిఈత
అదికాదు నీటినేత.

చావు పుట్టుకలు
జీవితానికి ఇరుగట్లు.
నిత్యప్రస్థానం తప్పుతుందా
మృత్యుతీరం చేరేదాకా.
ఆశల దీప స్తంభాలకు
నిరాశలు క్రీనీడలు.
సత్యాల జీవవాహినులకు
స్వప్నాలు రంగులబుడగలు.
ఆ నీడలకు జడుసుకోక
ఆ బుడగలకు భ్రమసిపోక
సాగిపోతాడు కాంతిలహరిలా
చైతన్యకేతనుడు మానవుడు.
ఆ వెలుగు
ఆవులించే కాలానికి వెన్నుచరుపు.
ఆ అడుగు
ఆగిపోయిన మార్గానికి మరోమలుపు

# 5

అడుగు సాగుతున్నది
అడుసులో నక్కిన ముళ్ళను తొక్కేస్తూ.
అడుగు సాగుతున్నది
అడ్డగించిన మంచుబెడ్డలను కక్కేస్తూ.
కనిపిస్తున్నాయి అడుగుకంటికి
మనుషుల తోళ్ళుకప్పుకున్న తోడేళ్ళు.
వినిపిస్తున్నాయి అడుగుచెవికి
తునిగిపోతున్నా అరవలేని లేళ్ళనోళ్ళు.
అడుగు గుండెలో ఉబికింది
కడలిని ముంచేసే కన్నీరు.
అడుగు గొంతులో ఉరిమింది
పిడుగులను మింగేసే హోరు.
'అయ్యో మనిషీ?
అహంకారాల రంగద్దాలను
అంతరంగానికి తొడుక్కున్న మసీ!
తెలుపు నలుపుల కొలమానాలతో
విలువ కడుతున్నావా?
మల్లెపువ్వుకూ నల్లకలువకూ
ఎల్లలు పెడుతున్నావా?
ఏ వన్నె గోవైతేమి?
ఇచ్చే పాలు తెలుపే.

ఏ రంగు తనువైతేమి?
ఆ రక్తం ఎరుపే.
గుహనుంచి విడివడ్డావు
గుడిలోకి చొరబడ్డావు
ధ్యానంలో జ్వలించావు
జ్ఞానంలా వర్షించావు.
ఐదు రూపాలుగా ఉన్న ప్రకృతిని
ఆలోకించావు ఒకటిగా.
ఏడు పాయలుగా సాగే శ్రుతిని
ఆలపించావు ఆత్మకృతిగా.
ఎందుకు చొరబడింది ఇరుకుదారి
ఈ విశాల ఘంటాపథంలో?
ఎందుకు ఏర్పడింది మండుటెడారి
ఈ శ్యామలశాద్వలంలో?
ఉరుముతున్న అడుగును చూసి
పరిహసించింది వర్ణాహంకారం.
ఆ ప్రగతిని కబళించాలని
ఆవరించింది శ్వేతాంధకారం.

ఏ రంగులు పులుముకున్నా
ఎప్పుడైనా గెలిచిందా చీకటి?
ఏ ఆంక్షలు నిషేధించినా
ఉదయించకుంటుందా కిరణసంపుటి?

అడుగు ఆగ్రహించి కదలగా
అడుసు పొంగులెత్తింది వరదగా.
తెలుపురంగు తలకెక్కిన మౌఢ్యం
తేలిపోతున్నది ఎండుగరికగా.
వలలతో పట్టేసే మత్స్యమా మనిషి?
గొలుసులతో కట్టేసే మృగమా మనిషి?
హత్య ఎరుగని సత్యాన్నే మరిచావా
నిత్యం సిలువకు మొక్కుకునే మనిషీ!
ఎక్కడిది నువ్వెక్కిన ఆసనం?
ఎవరిది నువ్వు వల్లించే భాషణం?
సాటిమనిషిపై స్వారీ చేస్తూనే
చాటుతున్నావా ప్రేమశాసనం?
తరలిపోతున్న తిరుగులేని ఆ అడుగు
దాస్యగ్రీష్మతప్తులకు పట్టిన గొడుగు.
సామ్యాన్ని ప్రసరించిన ఆ అడుగు
స్వామ్యాన్ని ప్రతిఘటించిన తొలినుడుగు.

ఆ నుడుగు అంతటితోనే ఆగిందా?
అది సాగింది స్వేచ్ఛకు ఊపిరిలా.
ఉరిమిచూస్తున్న కంచెలను ఉన్మూలిస్తూ
పరిక్రమించింది ఝంఝూలహరిలా.
నల్లని భుజంమీద వాలింది
తెల్లనిచేయి పావురంలా.

డా॥ సి. నారాయణరెడ్డి

దౌర్జన్యాన్ని పెళ్లగించుకుని లేచింది
సౌజన్యం గోపురంలా.
అక్షలచేతులు పండించే ధాన్యం
ఒక్కలోగిట్లో పరుకుచుంటే
కోట్ల చెమటబొట్లు కురిసే మూల్యం
ఒక్కగుప్పిట్లో అణిగివుంటే
అచ్చమైన సౌజన్యం
చచ్చుపీనుగలా పడి ఉంటుందా?
రెచ్చిపోయిన రక్తఘోషతో
చిచ్చురెక్కలు సాచకుంటుందా?
పెడితేనే పుచ్చుకునే చేయి
పిడికిలెత్తి అడగకుంటుందా?
తిడుతున్నా ఊరుకునే నోరు
పిడుగులా ప్రశ్నించకుంటుందా?
ఏ మనీషి శిరంలోనో
ఇగురులెత్తిన సామ్యవేదం
ఏ మనస్వి కలంలోనో
ఎగిసివచ్చిన క్రాంతినాదం
దిక్కుల గీట్లను విడిచి
దేశాల గట్లను తుడిచి
చొరబారకుంటుందా
దీక్షమతుల నరాల్లో.
పురివిప్పకుంటుందా
చిరపీడితుల స్వరాల్లో.

ఆ నరాల్లో మునిగిన మూల్గులకు
ఆ స్వరాల్లో మూగిన మూర్ఛనలకు
తన గుండెను గర్జించే సంద్రంగా మార్చి
తన గొంతును ఘోషించే యంత్రంగా తీర్చి
పొడుచుకొస్తున్నా దొక
విక్రాంతినేత
తుడుచుకుపోతున్నది
గతం గీసిన గీత.

అది
ఉగ్రచేతన తెప్పించిన
ఉదగ్ర భూకంపం.
కాలశిఖరం దూకించిన
జ్వాలాజలపాతం.
వణుకుపుట్టింది
పాతుకుపోయిన వజ్రదుర్గాలకు.
చెమటపట్టింది
బిగుసుకుపోయిన ఉక్కుచట్టాలకు.
గంగిరెద్దుల కొమ్ముల్లో
కత్తిమొనలు మెరుస్తున్నాయి.
గోమాతల గిట్టల్లో
కొడవలి అంచులు నడుస్తున్నాయి.
తెగిపోతున్న కండలు
ఎగురుతున్నాయి జెండాలుగా.

పగిలిపోతున్న గుండెలు
ఎగబడుతున్నాయి అగ్నికుండాలుగా.
పైకెత్తిన ఆ చేతుల్లో
పీకలు తెగిన సంకెళ్ళు.
కదలనివ్వని ఆ వీధుల్లో
కదనుతొక్కిన పిడికిళ్ళు.
కటకటాల్లా అడ్డునిలిచిన
కటికచీకట్ల గట్లను చీల్చుకుని
పొర్లివస్తున్న పొద్దుపొడుపులు.
కన్నీటిచుక్కల్లో
చెమటతుంపరల్లో
కణకణలాడుతున్న
దినకరబింబాలు.
అంధకారం గద్దెను ఉన్మూలించి
తరలి తరలిపోతున్న
అరుణకిరణ పటాలాలు.
చిందిన స్వేదబిందువులకే
అందిన సస్యఫలాలు.
పరిశ్రమించే శరీరాలకే
ప్రాప్తించిన నిత్యసుఖాలు.
మూలకువడ్డాయి విచ్చుకొరడాలు
మూగవడ్డాయి పిచ్చిసరదాలు.
తొలిగిపోయాయి ఏళ్ళతరబడి
తలకెక్కిన నల్లమందు వరదాలు.

ద్యోతలానికి ముడుపుకట్టిన చూపులు
భూతలస్వర్గాన్ని చూస్తున్నాయి.
అదృష్టరేఖలను తడుముకునే చేతులు
ఆశించిన భవితవ్యాన్ని పండిస్తున్నాయి.
చక్రాలనూ చట్టాలనూ తిప్పినహస్తం
కావ్యసృష్టినీ
శాస్త్రదృష్టినీ
విస్తరించిన మస్తకం
పంచుకున్న విలువ ఒకటే
పెంచుకున్న పరువు ఒకటే.

సమతను సాధించే ఆ అడుగు
స్తంభించిపోదు ఒక మేరకు.
సాగిపోతూనే ఉంటుంది
సరిహద్దులు దాటి మునుముందుకు.
మౌనమే నినాదంగా
మందహాసమే మహాస్త్రంగా
సహనమే కవచంగా
శాంతమే ప్రవచనంగా
నిరాడంబరంగా సాగే ఆ అడుగు
గిరీంద్రాల తలలు వంచింది.
నిశ్శబ్దంగా మోగే ఆ అడుగు
నీరధులను అనువదించింది.

ఉప్పుగొంతుకలో ధ్వనించింది
నిప్పులాంటి స్వరం.
కదురుమూల్గులో వినిపించింది
కదన శంఖారవం.
ఉజ్జ్వలించింది కోట్లహృదయాలలో
ఒకే మాతృమూర్తి.
ఉబికివచ్చింది కోట్లకంఠాలలో
ఒకే ధాత్రిగీతి.
అన్నిదిక్కులూ ఎగురుతున్నాయి
ఒకే పతాకగా
అన్నిదృక్కులూ అల్లుకున్నాయి
ఒకే ప్రతీకగా.
గుండెలు సవాలుచేస్తున్నాయి
తుపాకీగుండ్లను
తలలు ప్రతిఘటిస్తున్నాయి
లాఠీలమొనలను.
మదమలు ప్రవహిస్తున్నాయి
చెరసాలలు మునిగేటట్టు
మెడలు పరిక్రమిస్తున్నాయి
ఉరికొయ్యలు అరిగేటట్టు.
ఎక్కడివీ తరంగాలు?
ఎన్నెన్ని రంగుల విహంగాలు?
పొంగుతూ నడుస్తున్నాయి
నడుస్తూ ఎగుస్తున్నాయి

ముడుచుకుపోయిన సందుల్లోంచి
పరుచుకుపోయిన రహదారుల్లోంచి.
ఏ గుడిసెలు పంపినవో ఇవి?
ఏ గుళ్ళు మంత్రించినవో ఇవి?
ఏ మహళ్ళు అర్పించినవో ఇవి?
ఏ మమతలు దీవించినవో ఇవి?

నిన్నటి మట్టిబెడ్డలేనా
నేడు మండుతున్న స్ఫులింగాలు.
నిన్నటి గడ్డిపరకలేనా
నేడు లేస్తున్న ధ్వజస్తంభాలు.
నిన్నటి మేషకంతాలేనా
నేడు గర్జిస్తున్న కంఠీరవాలు.
నిన్నటి దూదిపింజలేనా
నేడు ప్రతిఘటిస్తున్న లోహబాహువులు.
తెల్లబోయింది —
తన సీమలో అహర్నిశలు
సూర్యుణ్ని కట్టేసుకున్న దొరతనం.
తత్తరపడింది —
తన పెత్తనాన్ని ఆయుధాల్లో
కుత్తుకనిండా కుక్కుకున్న దొరతనం.
కంపరం పుట్టించి
కొవ్వెక్కిన కరాలకు.

కొంపమునిగినట్టయింది
సువిశాల సామ్రాజ్యతీరాలకు.
ఇన్ని పాతరల తుపాకిమందు
ఎగిరిపోయిందే
ఒక్క ఒక్క పలచని నిశ్వాసంముందు.
ఇన్ని అంతస్తుల పునాదిరాళ్ళు
ఎగిరిపడ్డాయే
ఒక్క చెక్కు చెదరని విశ్వాసం ముందు.

అది అపూర్వోదయం
అర్ధరాత్రి ఉషోదయం
ఎగిరింది మూడువన్నెలతో
ఎదురుచూస్తున్న భానుహృదయం.
నదీనదాల పెదవులపై
కదిలే విముక్తరాగిణులు.
గిరిపదాలలో
పురపథాలలో
పరవశించే ఉత్సాహవాహినులు.
చిందులుతొక్కే యంత్రాలయాలు
శిరస్సులూపే సస్యాలయాలు
పులకలెత్తే లోగిళ్ళు
పొంగులెత్తే అంగళ్ళు
స్వచ్ఛందచ్ఛందంలాంటి

సత్కవితాస్పందంలాంటి
సంరంభంలో తడిసి
సంతృప్తిలా వెల్లివిరిసి
అడుగు ప్రస్థానించింది
పుడమినిండా ఉషస్సులు ముద్రిస్తూ.
కట్టువడిన నాల్కలపైన
క్రాంతిభాషలు ఆవిష్కరిస్తూ.

అడుగుతిరిగి చూసుకుంది.
అనంతంగా పారుతున్న చరిత్రలో
తన ముద్రలెన్నని?
తాను తిప్పిన మలుపులెన్నని?
ఆ ముద్రలు తనవేనా
ఆ వేళ్ళ సందుల్లో పిచ్చిగీతలేమిటి?
ఆ మలుపులు తనవేనా
ఆ మూలల్లో ముసురుకున్న నెత్తుటినీడలేమిటి?
తాను దువ్విన పావురాళ్ళెక్కడ?
తలలెత్తి నీల్గుతున్నాయి రాబందులు.
తాను నాటిన పూలమొక్కలెక్కడ?
తలలు బలిసి నిలుచున్నాయి ముళ్ళకంచెలు.

'మనిషీ! ఎక్కడ నువ్వెక్కడ?
మట్టిలోంచి మింటిలోకి చిమ్ముకొస్తున్నావా?
నిర్మించుకున్న అహంకారాల ప్రాకారాలు
మట్టిగరుస్తుంటే
నిట్టూర్పుల శిథిలాలను
పట్టుకు వేలాడుతున్నావా?
పరమాణువుల శిరస్సుల్లో చొరబడి
పరికించిన సత్యాల పరమావధి
వినూత్న చైతన్యసృజనమా
విశ్వగోళ విధ్వంసనమా?
ఎంత పచ్చగా వెలుగుతున్నది
ఇన్నాళ్ళు నువ్వు పెంచిన సంస్కృతి
సహమానవ హననంలో
సమజీవన దహనంలో.'
ఆదేస్వరం అదేస్వరం
అధికారంలా ప్రతిధ్వనిస్తూ
మనిషిలోని సంకల్పమూలాన్ని
మళ్ళీ మళ్ళీ ఎత్తిపొడుస్తూ.
మనిషి చలించలేదు
మౌనాన్ని వర్షించాడు.
మాటలకందని శ్రుతిలో
మనస్సుతో ఘోషించాడు.

ఇది నిత్యప్రస్థానం
ఎగుడుదిగుళ్ళు తప్పవు.
ఇది నిత్యప్రయోగం
ఎదురుదెబ్బలు తప్పవు.
వల్లకాటి దిబ్బల చుట్టూ
ఊళ్ళ కాపురాలు.
ఇసుకమండే ఎడారిచుట్టూ
పసిమిపండే మాగాణాలు.
మారణధూమాన్ని ఊదేసే
జీవన పవనాలు.
మృత్యుశాసనాన్ని పొడుచుకొచ్చే
నిత్య శిశూదయాలు.
ఆకులు రాలిపోతేనేమి?
చిగురాకులు పుట్టవా?
నీళ్ళు ఇగిరిపోతేనేమి?
నీలిమబ్బులు గజ్జెకట్టవా?
అలలు చలించినప్పుడే
జలానికి ఉద్దీపనం
రక్తం ప్రసరించినప్పుడే
నరాలకు ఉజ్జీవనం.

అణువునుంచి అంతరిక్షానికి
అంబరంనుంచి అవనీతలానికి
అనుభూతినుంచి ఆకృతికి
అదృశ్యంనుంచి అభివ్యక్తికి
జరుగుతున్న అవిరళశోధనమిది.
జారిపడుతున్నా
మెట్టుమెట్టుగా
ఆరోహిస్తున్న సాధనమిది.
ఏ మసకసందెలు కమ్ముకున్నా
ఆ మనసు కాంతిచక్షువే.
ఏ మంచుగడ్డలు పేరుకున్నా
ఆ మేధ జ్వలనధాతువే.
ఆ కంటిని కబళించాలని
ఆ కాంతిని హరించాలని
తమస్సు వలపన్నినప్పుడు
మనస్సు పట్టుతప్పినప్పుడు
ఆలోచన ఆయుధంగా
అంతశ్చేతన ఆలంబనంగా
పురోగమిస్తాడు మనిషి
పరిసరాలపైకెగిసి
రెండుగట్లను ఒరుసుకుంటూ

రేబవళ్ళను మోసుకుంటూ
గుండెలోని సుడిగుండాలను
నిండునవ్వులుగా మలచుకుంటూ.

మండిపడే గ్రీష్మంలో
మబ్బుకలలు నారుపోసుకుంటూ
కుంభవృష్టి పాతంలో
కొండలను కుమ్మివేసుకుంటూ
సాగిపోయే ప్రవాహం
చావులేని జీవితం.
అడుగు నేలపై మోపుతూనే
ఆకాశం అంచులు తడుతూ
రెక్కలు రెంటితో ఈదుతూనే
దిక్కులన్నిటినీ గిలకొడుతూ
తరలిపోయే జీవితం
తిరిగిచూడని చిరపథం.
ఋషిత్వానికీ పశుత్వానికీ
సంస్కృతికీ దుష్కృతికీ
స్వచ్ఛందతకూ నిర్బంధతకూ
సమార్ద్రతకూ రౌద్రతకూ
తొలిబీజం మనసు
తులాదూపం మనసు.

మనసుకు తొడుగు మనిషి
మనిషికి ఉడుపు జగతి.
ఇదే విశ్వంభరాతత్త్వం
ఇదే అనంతజీవితసత్యం.

* * *